శ్రీ హేమలంబ నామ సంవత్సర

# శ్రీ కారుపర్తి కోటేశ్వరరావు సిద్ధాంతి గారి

# శ్రీ గాయత్రి గంటల పంచాంగం








శ్రీ హేమలంబ నామ సంవత్సర

శ్రీ గాయత్రి




# గంటల పంచాంగము

దృక్సిద్ధాంత ప్రామాణిక పంచాంగము

2017-2018











సువర్ణసింహతలాట సన్మాన గ్రహీత

'దైవజ్ఞరత్న' కారుపర్తి కోటేశ్వరరావు సిద్ధాంతి

For The Love Of
Blissfully Authentic Sweets
Enjoy The Tasteful Journey Of



# Sarvani Sweets

CELEBRATING TASTE

Asilametta • Malkapuram • NAD Junction • Seethammadhara • Ushodaya •
Ph: 0891-2581188 / 0891-2527272

A Crispy and crunchy range of products




as rich as your grandma's recipes

Crescent Towers, Seetammadhara
Ph: 0891-2503794 / 2744599



తీయతీయని కమ్మని రుచుల సమ్మేళనం...
రసపూర్ణ వారి ఆహ్వానం...



రసపూర్ణ

# Rasapurna

Authentic Royal Recipes

CATERING • TAKEAWAY

TPT Colony, Seetammadhara.
Ph: 0891-2746969



Myriad Concepts 96767 19016

శ్రీరస్తు　　　　　శుభమస్తు　　　　　అవిఘ్నమస్తు



# కారుపర్తి వారి
## శ్రీ హేమలంబి నామ సం॥ర దృక్సిద్ధాంత ప్రామాణిక గంటల పంచాంగము 2017-2018



శ్లో॥ ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణైః ।
రుక్తామిందు నిబద్ధ రత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।
గాయత్రీం వరదాభయాం కుశకశా శుభ్రం కపాలం గదాం ।
శంఖం చక్ర మదారవింద యుగళం హస్తైర్వహంతీం భజే ॥

## పంచాంగ కర్త



"దైవజ్ఞరత్న", "సువర్ణ సింహ తలాట సన్మాన గ్రహీత"


## కారుపర్తి కోటేశ్వరరావు సిద్ధాంతి

పల్లాలమ్మ గుడి వీధి, జగ్గన్నపేట, మామిడికుదురు మం., తూ.గో. జిల్లా
సెల్ : 98668 64383, రెసిడెన్స్ : 248949 (08862)
e-mail : mgastrologi@gmail.com

బ్రాంచి : రైతు బజారు వెనుక, సి.ఎమ్.ఆర్. వాకింగ్ ట్రాక్ ప్రక్కన,
సీతమ్మధార, విశాఖపట్టణం





**మోహన్ పబ్లికేషన్స్**
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం-1.

free books. facebook MOHAN PUBLICATIONS
www.mohanpublications.com
www.granthanidhi.com
www.kinige.com, dailyhunt app.

# విషయసూచిక



# నవగ్రహ ధ్యాన శ్లోకములు

**1. రవి** : జపాకుసుమ సంకాశం కాస్యపేయం మహాద్యుతిమ్
తమోరిం సర్వ పాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్ 6 వేలు
**ఓం హ్రాం, హ్రీం, హ్రౌం, సః సూర్యాయ నమః**

**2. చంద్ర** : దధిశంఖ తుషారాభం క్షీరోదార్నవ సముద్భవమ్
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం 10 వేలు
**ఓం శ్రాం, శ్రీం, శ్రౌం, సః చంద్రాయ నమః**

**3. కుజ** : ధరణీ గర్భసంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తి హస్తం తం మంగళమ్ ప్రణమామ్యహమ్ 7 వేలు
**ఓం క్రాం, క్రీం, క్రౌం, సః భౌమాయ నమః**

**4. బుధ** : ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్
సౌమ్యం సౌమ్య గుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్ 17 వేలు
**ఓం బ్రాం, బ్రీం, బ్రౌం, సః బుధాయ నమః**

**5. గురు** : దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభమ్
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ 16 వేలు
**ఓం హ్రాం, హ్రీం, హ్రౌం, సః బృహస్పతయే నమః**

**6. శుక్ర** : హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుమ్
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గం ప్రణమామ్యహమ్ 20 వేలు
**ఓం ద్రాం, ద్రీం, ద్రౌం, సః శుక్రాయ నమః**

**7. శని** : నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్
ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్ 19 వేలు
**ఓం ఖ్రాం, ఖ్రీం, ఖ్రౌం, సః శనయే నమః**

**8. రాహు** : అర్థకాయం మహావీరం చంద్రాదిత్య విమర్ధనమ్
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ 18 వేలు
**ఓం భ్రాం, భ్రీం, భ్రౌం సః రాహవే నమః**

**9. కేతు** : ఫలాశ పుష్పసంకాశం తారకా గ్రహమస్తకమ్
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తంకేతుం ప్రణమామ్యహమ్ 7 వేలు
**ఓం ప్రాం, ప్రీం, ప్రౌం సః కేతవే నమః**

**ఈ శ్లోకములు పఠించుట వలన గ్రహదోషములు నివారణ అయి మానసిక ప్రశాంతత చేకూరి దుఃఖ, ఈతిబాధల నివారణ తప్పక కల్గును.**



# శ్రీ దేవి ఖడ్గమాలా స్తోత్రం

## శ్రీ దేవీ ప్రార్థన

హ్రీం కారాసన గర్భితానల శిఖాం సౌః క్లీం కళాం భిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం వరసుధా ధౌతాం త్రిణేత్రోజ్జ్వలామ్
వందే పుస్తక పాణి మంకుశధరాం స్రగ్భూషితా ముజ్జ్వలాం
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీమ్

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఓం నమస్త్రి పురసుందరి హృదయదేవి! శిరోదేవి! శిఖాదేవి! కవచదేవీ! నేత్రదేవి! అస్త్రదేవి ! కామేశ్వరి! భగమాలిని! నిత్యక్లిన్నే! భేరుండే! వహ్నివాసిని! మహావజ్రేశ్వరి! శివదూతి! త్వరితే! కులసుందరి! నిత్యే! నీలపతాకే! విజయే! సర్వమంగళే! జ్వాలామాలిని! చిత్రే! మహానిత్యే! పరమేశ్వర పరమేశ్వరి! మిత్రేశమయి! షష్ఠీశమయి! ఉడ్డీశమయి! చర్యానాధమయు! లోపాముద్రామయి! అగస్త్యమయి! కాలతాపనమయి! ధర్మాచార్యమయి ముక్తకేశీశ్వరమయి! దీపకళానాధమయి! విష్ణుదేవమయి! ప్రభాకరదేవమయి! తేజోదేవమయి! మనోజదేవమయి! కల్యాణదేవమయి! వాసుదేవమయి! రత్నదేవమయి! శ్రీరామానందమయి! అణిమాసిద్ధే! లఘిమాసిద్ధే! మహిమాసిద్ధే! ఈ శిత్వసిద్ధే! వశిత్వసిద్ధే! ప్రాకామ్యసిద్ధే! భుక్తిసిద్ధే! ఇచ్ఛాసిద్ధే! ప్రాప్తిసిద్ధే! సర్వకామసిద్ధే! బ్రాహ్మి! మహేశ్వరి! కౌమారి! వైష్ణవి! వారాహి! మాహేంద్రి! చాముండే! మహాలక్ష్మి! సర్వసంక్షోభిణి! సర్వవిద్రావిణి! సర్వాకర్షిణి! సర్వవశంకరి! సర్వోన్మాదిని! సర్వమహాంకుశే! సర్వఖేచరి! సర్వబీజే! సర్వమోనే! సర్వత్రిఖండే! త్రైలోక్యమోహనచక్రస్వామిని! ప్రకట యోగిని! కామాకర్షిణి! బుద్ధ్యాకర్షిణి! అహంకారాకర్షిణి! శబ్దాకర్షిణి! స్పర్శాకర్షిణి! రూపాకర్షిణి! రసాకర్షిణి! గంధాకర్షిణి! చిత్తాకర్షిణి! ధైర్యాకర్షిణి! స్మృత్యాకర్షిణి! నామాకర్షిణి! బీజాకర్షిణి! ఆత్మాకర్షిణి! అమృతాకర్షిణి! శరీరాకర్షిణి! సర్వాశాపరిపూరక చక్రసామిని! గుప్తయోగిని! అనంగ కుసుమే, అనంగ మేకలే, అనంగ మదనే, అనంగ మదనాతురే, అనంగ రేఖౌ, అనంగ వేగిని, అనంగాంకుశే, అనంగమాలిని సర్వ సంక్షోభణ చక్రస్వామిని, గుప్తతరవేగిని సర్వసంక్షోభిని, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వహ్లాదిని, సర్వసమ్మోహిని, సర్వస్తంభిని, సర్వజృంభిణి, సర్వశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సార్వార్ధసాధికే సర్వసంపత్తిపూరణి, సర్వమంత్రమయి, సర్వ ద్వంద్వ క్షయంకరి సర్వసౌభాగ్యదాయక, చక్రస్వామిని, సంప్రదాయ యోగిని, సర్వసిద్ధిప్రదీ, సర్వసంప్రత్ప్రదే, సర్వప్రియంకరి, సర్వమంగళకారిని, సర్వకామప్రదే, సర్వాంగసుందరి, సర్వసౌభాగ్యదాయిని, సర్వార్థసాధక, చక్ర స్వామిని కుళోత్తీర్ణ యోగిని, సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్యప్రదాయిని, సర్వ జ్ఞానమయి, సర్వవ్యాధి వినాశిని, సర్వాధార స్వరూపే, సర్వపాపహరే! సర్వా నందమయి, సర్వారక్ష, స్వరూపిణి, సర్వేప్సిత, ఫలప్రదే, సర్వరక్షాకర చక్రస్వామిని, నిగర్భయోగిని,

వశిని, కామేశ్వరి, మోదిని, విమతే, అరుణీ, జయిని, సర్వేశ్వరి, కౌళిని, సర్వ రోగహర చక్రస్వామిని రహస్యయోగిని, బాణిని, చాపిని, పాశిని, అంకుశిని, మహాకామేశ్వరి, మహావజ్రేశ్వరి, మహాభగమాలిని, మహాశ్రీసుందరి, సర్వసిద్ధిప్రద చక్రస్వామిధి, అతిరహస్యయోగిని, శ్రీశ్రీమహ భట్టారికే సర్వ నందమయి చక్రస్వామిని, మహాత్రిపురసుందరి. మహామహేశ్వరి, మహామహారాజ్ఞి, మహామహాశక్తే, మహామహా గుప్తే, మహామహాజ్ఞప్తే, మహామహానందే, మహామహాస్కందే, మహామహాశయే, మహామహా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి నమస్తే నమస్తే నమస్తే నమః

## గణేశ పంచరత్న స్తోత్రమ్



ముదా కరాత్త మోదకం సదా విముక్తి సాధకం
కళాధరావతంసకం విలాస లోక రక్షకమ్ ।
అనాయకైకనాయకం వినాశితేభ దైత్యకం
నతాశుభాసు నాశకం నమామి తం వినాయకమ్ ॥ ।1।

నతేతరాతి భీకరం నవోదితార్క భాస్వరం
నమస్సురారి నిర్జరం నతాధికాపదుద్ధరమ్ ।
సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం
మహేశ్వరం తమాశ్రయే పరాత్పరం నిరంతరమ్ ॥ ।2।

సమస్త లోక శంకరం నిరస్తదైత్యకుంజరం
ధరేధరోధరం వరం వరేభవక్త్ర మక్షరమ్ ।
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్ ॥ ।3।

అకించనార్తిమార్జనం చిరంతనోక్తి భాజనం
పురారిపూర్వనందనం సురారి గర్వ చర్వణమ్ ।
ప్రపంచ నాశ భీషణం ధనంజయాది భూషణం
కపోలదానవారణం భజే పురాణవారణమ్ ॥ ।4।

నితాంత కాంతదంతకాంతిమంతకాంతకాత్మజం
అచింత్యరూపమంతహీనమంతరాయ కృంతనమ్ ।
హృదంతరే నిరంతరం వసంతమేవ యోగినాం
తమేకదంతమేవ తం విచింతయామి సంతతమ్ ॥ ।5।

మహాగణేశ పంచరత్నమాదరేణ యో న్వహం
ప్రజల్పతి ప్రభాతకే హృది స్మరన్ గణేశ్వరమ్ ।
అరోగతామ్ అదోషతాం సుసాహితీం సుపుత్రతాం
సుమాహితాయురష్టభూతిమభ్యుపైతి సో చిరాత్ ॥

**॥ ఇతి శ్రీ శంకరాచార్య విరచితం శ్రీ గణేశ పంచరత్న స్తోత్రమ్ ॥**

# శ్రీ వేంకటేశ్వర గోవింద నామములు

శ్రీ శ్రీనివాసా గోవిందా
శ్రీ వేంకటేశా గోవిందా
భక్తవత్సలా గోవిందా
భాగవతప్రియ గోవిందా
నిత్యనిర్మలా గోవిందా
నీలమేఘశ్యామ గోవిందా
పురాణపురుష గోవిందా
పుండరీకాక్షా గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥



వరాహ నరసింహ గోవిందా
వామన భృగురామ గోవిందా
బలరామానుజ గోవిందా
బౌద్ధకల్కిధర గోవిందా
వేణుగాన ప్రియ గోవిందా
వేంకటరమణ గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

నందనందనా గోవిందా
నవనీత చోర గోవిందా
పశుపాలక శ్రీ గోవిందా
పాపవిమోచన గోవిందా
దుష్టసంహార గోవిందా
దురిత నివారణ గోవిందా
శిష్టపరిపాలక గోవిందా
కష్టనివారణ గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

వజ్రమకుటధర గోవిందా
వరాహమూర్తివి గోవిందా
గోపిజనలోల గోవిందా
గోవర్ధనోద్ధార గోవిందా
దశరథనందన గోవిందా
దశముఖ మర్ధన గోవిందా
పక్షివాహన గోవిందా
పాండవప్రియ గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

మత్స్యకూర్మా గోవిందా
మధుసూదన హరి గోవిందా

సీతానాయక గోవిందా
శ్రితపరిపాలక గోవిందా
దరిద్రజనపోషక గోవిందా
ధర్మసంస్థాపక గోవిందా
అనాథ రక్షక గోవిందా
ఆపద్బాంధవ గోవిందా
శరణాగతవత్సల గోవిందా
కరుణాసాగర గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

కమలదళాక్ష గోవిందా
కామితఫలదాతా గోవిందా
పాపవినాశక గోవిందా
పాహిమురారే గోవిందా
శ్రీముద్రాంకిత గోవిందా
శ్రీవత్సాంకిత గోవిందా
ధరణీనాయక గోవిందా
దినకరతేజా గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

పద్మావతీప్రియ గోవిందా
ప్రసన్నమూర్తి గోవిందా
అభయహస్త ప్రదర్శన గోవిందా
మర్త్యావతార గోవిందా

శంఖచక్రధర గోవిందా
శార్ఙ్గగదాధర గోవిందా
విరజాతీర్థస గోవిందా
విరోధిమర్థన గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

సాలగ్రామధర గోవిందా
సహస్రనామా గోవిందా
లక్ష్మీవల్లభ గోవిందా
లక్ష్మణాగ్రజ గోవిందా
కస్తూరితిలక గోవిందా
కాంచనాంబరధర గోవిందా
గరుడవాహన గోవిందా
గజరాజ రక్షక గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

వానరసేవిత గోవిందా
వారధిబంధన గోవిందా
ఏడుకొండలవాడ గోవిందా
ఏకస్వరూపా గోవిందా
శ్రీరామకృష్ణా గోవిందా
రఘుకులనందన గోవిందా
ప్రత్యక్షదేవా గోవిందా
పరమదయాకర గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా

వజ్రకవచధర గోవిందా
వైజయంతిమాల గోవిందా
వడ్డికాసులవాడ గోవిందా
వసుదేవతనయా గోవిందా
బిల్వపత్రార్చిత గోవిందా
భిక్షుక సంస్తుత గోవిందా
స్త్రీపుంరూపా గోవిందా
శివకేశవమూర్తి గోవిందా
బ్రహ్మాండరూపా గోవిందా
భక్త రక్షక గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

నిత్యకళ్యాణ గోవిందా
నీరజనాభ గోవిందా
హాతీరామప్రియ గోవిందా
హరిసర్వోత్తమ గోవిందా
జనార్ధనమూర్తి గోవిందా
అభిషేకప్రియ గోవిందా
ఆపన్నివారణ గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

రత్నకిరీటా గోవిందా
రామానుజనుత గోవిందా
స్వయంప్రకాశ గోవిందా
ఆశ్రితపక్ష గోవిందా
నిత్యశుభప్రద గోవిందా
నిఖిలలోకేశా గోవిందా
ఆనందరూప గోవిందా
ఆద్యంతరహిత గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥

ఇహపర దాయక గోవిందా
ఇభరాజరక్షక గోవిందా
పరమదయాళో గోవిందా
పద్మనాభ హరి గోవిందా
తిరుమలవాసా గోవిందా
తులసీ వనమాల గోవిందా
శేషాద్రి నిలయ గోవిందా
శేషశాయిని గోవిందా
శ్రీనివాస శ్రీ గోవిందా
శ్రీవేంకటేశా గోవిందా
గోవిందా హరి గోవిందా
గోకులనందన గోవిందా ॥



# ఆదిత్య హృదయమ్

ఆదిత్య హృదయం త్రేతాయుగంలో రామ రావణ యుద్ధములో రావణుడు లొంగకపోవడంతో రాముడు చింతాక్రాంతుడై ఉన్నాడు. ఆకాశంలో నిలిచి యుద్ధం చూస్తున్న అగస్త్యుడు రాముడి వద్దకు వచ్చాడు. రామా! చింతా శోకాలను పోగొట్టేది, శత్రువులను నాశనం చేసేది జయావహమైనది. నిత్యం జపించవలసినది "**ఆదిత్య హృదయం**" అనే స్తోత్రం ఉంది. దానిని నీకు ఉపదేశిస్తాను స్వీకరించు - రామా! ఆపదలో ఉన్నా, దుర్గమ ప్రదేశాలలో ఉన్నా, భయపడుతూ ఉన్నా ఈ స్తోత్రాన్ని పఠిస్తే ఏ హాని జరగదు. దీనిని ముమ్మారు జపించి యుద్ధం చేసి రావణుణ్ణి వధించు అని చెప్పి అదృశ్యమయ్యాడు. అగస్త్య మహర్షి చెప్పినట్లుగా రాముడు ముమ్మారు ఆదిత్య హృదయం జపించగా మనస్సు ఉత్సాహంతో రావణుడితో ఏడు రోజులు రాత్రనక, పగలనక భయంకరమైన యుద్ధం చేసి వధించాడు. గుండె జబ్బులు మరియు అనారోగ్యముతో ఉన్నవారు జపిస్తే ఆరోగ్యవంతులు అవుతారు.

రామాయణ కాలంలోనే ఆదిత్య హృదయం విశిష్టతను లోకానికి అందించాడు రాముడు.

తతో యుద్ధ పరిశ్రాన్తం సమరేచి న్తయాస్థితమ్
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥
దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతోరణమ్
ఉపగమ్యాబ్రవీద్రామ మగస్త్యో భగవానృషిః ॥
రామరామ మహాబాహూ శ్రణుగుహ్యం
సనాతనమ్ యేన సర్వానరీన్వత్స సమరే విజయిష్యసి ॥
ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్
జయావహం జపేన్నిత్య మక్షయం పరమం శుభమ్ ॥
సర్వమంగళ మాంగళ్యం సర్వపాపప్రణాశనమ్
చిన్తాశోక ప్రశమన మాయుర్వర్ధనము త్తమమ్ ॥
రశ్మిమన్తం సముద్యన్తం దేవాసుర నమస్కృతమ్
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్ ॥
సర్వదేవాత్మకోహ్యేష తేజస్వీ రశ్మిభావనః
ఏషదేవాసురగణాన్ లోకాన్పాతి గభ స్తిభిః
ఏష బ్రహ్మా చ విష్ణు శ్చ శివః స్కన్దః ప్రజాపతిః
మహేన్ద్రో ధనదః కాలో యమః సోమోహ్యపాంపతిః ॥
పితరో పనవ స్సాధ్యా హ్యశ్వినో మరుతో మనుః
వాయు ర్వహ్నిః ప్రజాః ప్రాణా ఋతుకర్తా ప్రభాకరః ॥
ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభ స్తిమాన్
సువర్ణ సదృశో భానుః స్వర్ణ రేతా దివాకరః ॥
హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తి ర్మరీచిమాన్
తిమిరోన్మథనః శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్
హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః
అగ్నిగర్భోఽదితేః పుత్రః శంఖ శ్శిశిరనాశనః ॥

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీధీప్లవంగమః ॥
ఆతపీ మండలి మృత్యుః పింగళ స్సర్వ తాపనః
కవిర్విశ్వో మహాతేజా రక్త స్సర్వ భవోద్భవః ॥
నక్షత్ర గ్రహతారాణా మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్న మోస్తు తే ॥
నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥
జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః
నమో నమస్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥
నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః
నమః పద్మప్రభోధాయ మార్తాండాయ నమో నమః ॥
బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యా యాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయవపుషే నమః ॥
తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నా యామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥
త ప్తచామీకరాభాయ వహ్నాయే విశ్వకర్మణే
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥
నాశయ త్యేష వై భూతం త దేవ సృజతి ప్రభుః
పాయ త్యేష తప త్యేష వర్ష త్యేష గభ స్తిభిః ॥
ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏష ఏవాగ్ని హోత్రం చ ఫలం చై వాగ్ని హోత్రిణామ్ ॥
వేదా శ్చ క్రతవ శ్చైవ క్రతూనాం ఫల మేవ చ
యాని కృత్యాని లోకషు సర్వం ఏష రవిః ప్రభుః ॥
ఏన మాషత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ
కీ ర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ ॥
పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్
ఏత త్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥
అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వదిష్యసి
ఏవ ముక్త్వాత దాగస్త్యో జగామ చ యథాగతమ్ ॥
ఏత చ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో భవ త్తదా
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥
ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవా ప్తవాన్
త్రి రాచమ్య శుచి ర్భూత్వాధను రాదాయ వీర్యవాన్ ॥
రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోభవత్ ॥
అధ రవి రపద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః ॥
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్యగతో వచ స్త్వరేతి ॥

# శ్రీ దేవి సూక్తమ్



ఘంటాశూలహలాని శంఖముసలే చక్రం ధనుస్సాయకం
హస్తాబ్జైర్దధతీం ఘనాన్తవిలసచ్ఛీతాంశుతుల్య ప్రభామ్,
గౌరీదేహసముద్భవాం త్రిజగతా మాధారభూతాం మహా
పూర్వామత్ర సరస్వతీ మనుభజే శుమ్భాదిదైత్యార్ధినీం, 1
నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః,
నమః ప్రకృత్యై భద్రాయైనియతాః ప్రణతాః స్మతామ్, 2
రౌద్రాయై చ నమోనిత్యై గౌర్యై ధాత్ర్యై నమోనమః
జ్యోత్స్నాయై చేన్దురూపిణ్యై సుఖాయై సతతం నమః 3
కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధై కుర్మో నమో నమః
నైరుత్యైభూభృతాంలక్ష్మ్యై శర్వాణ్యై తే నమోనమః 4
దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణే,
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః 5
అతిసౌమ్యాతిరౌద్రాయై నతా స్తస్యై నమో నమః
నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమో నమః 6
యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్ధితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 7
యా దేవీ సర్వభూతేషు చేతనేత్యభిధీయతే,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 8
యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 9
యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 10
యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 11
యా దేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 12
యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 13
యా దేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 14
యా దేవీ సర్వభూతేషు క్షాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 15
యా దేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 16
యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 17
యా దేవీ సర్వభూతేషు శాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 18
యా దేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 19
యా దేవీ సర్వభూతేషు కాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 20

యా దేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 21
యా దేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 22
యా దేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 23
యా దేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 24
యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 25
యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 26
యా దేవీ సర్వభూతేషు భ్రాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 27
ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా,
భూతేషు సతతం తస్యైవ్యాప్తి దేవ్యై నమో నమః 28
చితిరూపేణ యాకృత్స్న మేతద్వ్యాప్య స్థితా జగత్,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః 29
స్తుతా సురైః పూర్వమభీష్ట సంశ్రయా – తథా సురేన్ద్రేణ దినేషు సేవితా,
కరోతు సాన శ్శుభ హేతురీశ్వరీ – శుభాని భద్రాణ్యభిహన్తుచాపదః 30



## ఆంజనేయ దండకము

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం, భజేవాయుపుత్రం, భజేవాలగాత్రం భజే హం పవిత్రం, భజేసూర్యమిత్రం,భజే రుద్రరూపం భజేబ్రహ్మ తేజమ్మటంచున్ ప్రభాతంబు సాయంత్రమున్నీదు సంకీర్తనల్ జేసి, నీ రూపు వర్ణించి, నీ మూర్తినింగాంచి నీ సుందరంబెంచి, నీ దాస దాసుండనై, రామభక్తుండనై నిన్నునే గొల్చెదన్, నిన్ను కీర్తించెదన్, నీ కటాక్షంబునన్ చూడుమా, నన్ను రక్షింపుమా, అంజనాదేవి గర్భోదయా! దేవ! నిన్నెంచ నేనెంత వాడన్, దయాశీలివై చూడుమా, దాతవై ప్రోవుమా, దగ్గరన్నిల్వుమా, తొల్లి సుగ్రీవుకున్మంత్రివై, స్వామి కార్యంబు నందుండి, శ్రీరామ సౌమిత్రులం జూచి, సర్వేశు పూజించి, శ్రీరామసుగ్రీవులన్ మైత్రితో గూర్చి శ్రీరాముడవ్వాలినిం జంపి, సుగ్రీవు పట్టాభిషేకంబు గావించి, శ్రీరామ కార్యార్థివై లంకకేతించియున్, లంకిణిన్ జంపియున్ జానకిన్ జూచి యానంద మొప్పంగ యూయుంగరంబిచ్చి, వృక్షంబులంగూర్చి, అక్షాసురున్ జంపి, లంకాపురిన్ గాల్చి, చూడామణిన్గొంచు సంద్రబునున్ దూకి, భూజాత సద్వార్త శ్రీరామ సంతోషితుం జేసి, సుగ్రీవునిన్, జాంబవంతున్నలున్నీలు నా అంగదున్, కూడియున్, సేతువున్ దాటి, కేశౌఘ సంఘంబుచే దైత్యులంద్రుంచగా, రావణుండంత, కాలాగ్నియై శక్తినిన్వైచి సౌమిత్రినిన్ మూర్ఛ నొందింపగా పోయి సంజీవినిన్ దెచ్చి, రామానుజ ప్రాణముల్ రక్ష గావించియున్, రామ బాణాగ్ని నా కుంభ కర్ణాదులన్ రావణుంగూడ జంపంగ లోకంబు లానందవైయుండ, సీతా మహాదేవినిన్ శ్రీరామునితో జేర్చి, వేగన్న యోధ్యాపురిన్ జేరి, పట్టాభిషేకంబు గావించి నావయ్యా, నే నామ సంకీర్తనల్ జేసినన్, పాపముల్ బాయునే, భీతియన్ దీరునే, భాగ్యముల్ గల్గునే, సర్వసామ్రాజ్యముల్ సర్వసంపత్తులున్ కల్గునే వానరా! యో భక్త మందార, యో పుణ్య సంచార, యోధీర, యోవీర నీవే సమస్తంబు నీవే మహాశక్తివై భూతపైశాచికా, శాకినీ, ఢాకినీ గాలి దయ్యంబులన్ నీదు వాలంబునన్ జుట్టి నేలంబడంగొట్టి, నీ ముష్టి ఘాతంబులన్, బాహుదండంబులన్, రోమఖడ్గంబులన్, ద్రుంచి, కాలాగ్నిరుద్రుండవై, బ్రహ్మతేజః ప్రభాభాసితంబైన నీ దివ్యతేజంబునున్ జూపి, శ్రీరామ భక్తాయటంచున్ దయా దృష్టి వీక్షించి నన్నేలు స్వామి, నమస్తే, సదా బ్రహ్మచారీ సువర్చస్వతీ వాయుపుత్రా నమస్తే! నమస్తే! నమస్తే! నమః

## ద్వాదశ నదులకు పుష్కరములు వాటి పుణ్య క్షేత్రములు



శ్లో॥ మేషే గంగా వృషే రేవ (నర్మదా) మిధునేచ సరస్వతి:
కర్కాటే యమునా ప్రోక్త సింహే గోదావరి స్మృతా॥
కన్యాయాం కృష్ణవేణిచ కావేరి ఘటికే స్మృతా॥
వృశ్చికే తామ్రపర్ణిచా (భీమ) చాపే పుష్కర వాహినీ (బ్రహ్మపుత్ర)
మకరే తుంగభద్రాచ కుంభే సింధు నదీస్మృతా
మీనే ప్రణీతాచ నదీ గురోసంక్రమణే స్మృత:॥
పుష్కరాఖ్యోమునీనాం హి ప్రదేశోత్ర బుద్ధై స్మృత:॥

1. గురుడు మేషరాశిలో ప్రవేశించినప్పుడు గంగానదికి పుష్కరాలు. గంగోత్రి, గంగాసాగర్, హరిద్వార్, బదరీ కేదార్‌నాథ్, కాశీలో జరుగుతాయి.
2. గురుడు వృషభరాశిలో ప్రవేశించినప్పుడు నర్మదా నదికి పుష్కరాలు. ఓంకారేశ్వరం, భేడాఘాట్‌లో జరుగుతాయి.
3. గురుడు మిధునరాశిలో ప్రవేశించినప్పుడు సరస్వతీ నదికి పుష్కరాలు. బదరీనాధ్, ప్రయాగ, బ్రహ్మసరోవరం, (రాజస్థాన్‌లో అజ్మీర్ దగ్గర) సన్నిహిత సరోవరం(హర్యానాలో కురుక్షేత్రం) దేవోస్వర్ణ (గుజరాత్‌లో) జరుగును.
4. గురుడు కర్కాటకరాశిలో ప్రవేశించినప్పుడు యమునా నదికి పుష్కరాలు. యమునోత్రి (ఋషీకేష్) మధుర బృందావనంలో జరుగును.
5. గురుడు సింహరాశిలో ప్రవేశించినప్పుడు గోదావరి నదికి పుష్కరాలు. నాసిక్, భద్రాచలం, కొవ్వూరు, రాజమహేంద్రవరం గోదావరి ప్రవహించు అనేక ప్రాంతాలలో జరుగుతాయి.
6. గురుడు కన్యారాశిలో ప్రవేశించినప్పుడు కృష్ణానదికి పుష్కరాలు. విజయవాడ, మంగళగిరి, అమరావతి, శ్రీశైలం, బిచ్‌పల్లి, వేదాద్రిలో జరుగుతాయి.
7. గురుడు తులారాశిలో ప్రవేశించినప్పుడు కావేరినదికి పుష్కరాలు. చిదంబరం శ్రీరంగం, తంజావూరు, కుంభకోణంలో జరుగుతాయి.
8. గురుడు వృశ్చికరాశిలో ప్రవేశించినప్పుడు భీమనదికి పుష్కరాలు. భీమశంకర్, పండరీపూర్‌లో జరుగుతాయి.
9. గురుడు ధనస్సురాశిలో ప్రవేశించినప్పుడు బ్రహ్మపుత్ర నదికి పుష్కరాలు. అస్సాం, గౌహతి, శివసాగర్, బ్రహ్మసరోవరంలో జరుగుతాయి.
10. గురుడు మకరరాశిలో ప్రవేశించినప్పుడు తుంగభద్రా నదికి పుష్కరాలు. మంత్రాలయం, అలంపూర్ హంసి, శృంగేరిలో జరుగుతాయి.
11. గురుడు కుంభరాశిలో ప్రవేశించినప్పుడు సింధూనదికి పుష్కరాలు. లకడ్, కాశ్మీర్, పాకిస్థాన్, కరాచీలో జరుగుతాయి.
12. గురుడు మీనరాశిలో ప్రవేశించినప్పుడు ప్రణీతానదికి పుష్కరాలు. కాలేశ్వరంలో జరుగుతాయి.

## పంచాంగ విశిష్టత



శ్లో॥ తిథేశ్చ(శియ మాప్నోతి వారా దాయుష్యవర్ధనం ।
నక్షత్రాత్ హరతే పాపం యోగాద్రోగనివారణమ్ ॥
కరణా త్కర్య సిద్ధిస్తు పంచాంగ ఫల ముత్తమమ్ ।
కాలవిత్కర్మ కృత్ ధీమాన్ దేవతానుగ్రహం లభేత్ ॥

తా॥ ఉగాది రోజున పంచాంగం వినడం, తిథి వలన సంపదలు, వారం వలన ఆయుష్య, నక్షత్రం వలన పాపపరిహారమును, యోగము వలన వ్యాధి నివృతయు, కరణము వలన కార్యసిద్ధి కలుగును. కావున కాలము తెలిసి కర్మములు చేయువారికి భగవదనుగ్రహము పొంది సుఖింతురు గాక.

ఆకాశంలో కోటానుకోట్ల నక్షత్రాల సముదాయములో అనేక పాలపుంతలు ఏర్పడి ఉన్నాయి. ఒక్కొక్క పాలపుంతలో అనేక సూర్యకుటుంబాలు ఉన్నాయి.

మనం నివశించే భూమి ఒకానొక పాలపుంతలోనిది – భూమి తన చుట్టూ తాను ఒకసారి తిరుగుట వలన రాత్రి పగలు ఏర్పడి ఒక రోజు అవుతుంది. భూమి చుట్టూ చంద్రుడు తిరగడం, చంద్రునితో సహ భూమి, సూర్యునిచుట్టూ ఒకసారి తిరుగుట వలన ఒక సం.రం ఏర్పడుతుంది. ఇలా రోజులు వారాలు, నెలలు, సంవత్సరాలు, యుగాలు, మహాయుగాలు, మన్వంతరాలుగా కాలాన్ని గణన చేసేది పంచాంగం మాత్రమే. గడియారాలు లేని ఆకాలంలో పగలు ప్రొద్దును బట్టి రాత్రి నక్షత్రాలను బట్టి టైం చెప్పగలగినది పంచాంగం మాత్రమే టెలిస్కోపులు లేని కాలంలో ముందుగా గ్రహణాలను చెప్పగలిగింది పంచాంగమే. క్రీస్తు పూర్వం నాడు, నేడు తెలుగు మాసాలలో కాలాన్ని గణన చేసేది పంచాంగమే. ఇలా కాల చక్రాన్ని తయారుచేసి ఏకాలంలో ఏమి ఆచరించాలో తెలియజేస్తూ మానవులకు జరుగు తున్నవి జరుగబోయేవి. మంచిచెడ్డలను ముందుగా తెలియజేసి ఆ దోషాలకు కొంతవరకు నివారించుటకు సూచనలు చేసేది పంచాంగమే. పండుగలు, వ్రతాలు నిర్ణయించి సమాజంలో ఆధ్యాత్మిక చింతన దైవచింతన కలిగించి మానవులలో దానం, ధర్మం గుణాలను పెంపొందించేది పంచాంగమే. అందుకే పంచాంగాన్ని దైవంగా పూజించడం, పంచాంగం చెప్పేవారిని దైవం యొక్క ఆజ్ఞను చెప్పుచున్నట్లుగా భావించడం సనాతనంగా వస్తున్న సాంప్రదాయం.

పంచాంగం ఏకులానికి, ఏమతానికి చెందినది కాదు. మానవ జాతి అందరకు ఉపయోగపడే ఖగోళ విజ్ఞానమే పంచాంగం. మానవుడు తన అదృష్టాన్ని పరిక్షించుకోవడానికి, దురదృష్టము నుండి కొంత వరకూ రక్షించుకోవడానికి దివ్య ఔషధంలా ఉపయోగపడేదే పంచాంగం. ఏమైనా దోషాలు దొర్లిన మన్నించి మా పంచాంగమును ఆదరించగలరని ఆశిస్తున్నాము. హృదయపూర్వక ధన్యవాదములు.

–పంచాంగకర్త

# నామ నక్షత్ర రాశి, గణ, నాడీ పొంతనములు

| నామాక్షరమాలిక | | | | నక్షత్ర పాదములకు రాశులు | గణములు | జంతువులు | నాడి |
|---|---|---|---|---|---|---|---|
| చూ | చే | చో | లా | అశ్విని 4 మేషం | దేవ | గుఱ్ఱం | ఆది |
| లీ | లూ | లే | లో | భరణి 4 మేషం | మనుష్య | ఏనుగు | మధ్య |
| అ | ఈ | ఊ | ఏ | కృత్తిక 1 మేషం 3 వృషభం | రాక్షస | మేక | అంత్య |
| ఓ | వా | వీ | వు | రోహిణి 4 వృషభం | మనుష్య | పాము | అంత్య |
| వే | వో | కా | కి | మృగ 2 వృష 2 మిధున | దేవ | పాము | మధ్య |
| కూ | ఖం | జ్ఞ | ఛా | ఆరుద్ర 4 మిధున | మనుష్య | కుక్క | ఆది |
| కే | కో | హా | హీ | పున3 మిధున1 కర్కాటకం | దేవ | పిల్లి | ఆది |
| హు | హే | హో | డా | పుష్య 4 కర్కాటకం | దేవ | మేక | మధ్య |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష 4 కర్కాటకం | రాక్షస | పిల్లి | అంత్య |
| మా | మీ | మూ | మే | మఖ 4 సింహం | రాక్షస | ఎలుక | అంత్య |
| మో | టా | టీ | టూ | పుబ్బ 4 సింహం | మనుష్య | ఎలుక | మధ్య |
| టే | టో | పా | పీ | ఉత్తర 1 సింహం 3 కన్య | మనుష్య | గోవు | ఆది |
| పూ | షం | ణా | ఠా | హస్త 4 కన్య | దేవ | దున్న | ఆది |
| పే | పో | రా | రి | చిత్త 2 కన్య 2 తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ | రే | రో | త | స్వాతి 4 తుల | దేవ | దున్న | అంత్య |
| తీ | తూ | తే | తో | విశా 3 తుల 1 వృశ్చి | రాక్షస | పులి | అంత్య |
| నా | నీ | నూ | నే | అనూ 4 వృశ్చికం | దేవ | లేడి | మధ్య |
| నో | యా | యీ | యు | జ్యేష్ఠ 4 వృశ్చికం | రాక్షస | లేడి | ఆది |
| యే | యో | బా | బి | మూల 4 ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| బూ | ధా | భా | ఢా | పూ॥షాఢ 4 ధనస్సు | మనుష్య | కోతి | మధ్య |
| బే | బో | జా | జి | ఉ॥షాఢ 1 ధను 3 మకరం | మనుష్య | ముంగిస | అంత్య |
| ఖ | ఖా | ఖె | ఖో | అభిజిత్ మకరం | మనుష్య | ముంగిస | అంత్య |
| జూ | జే | జో | ఖా | శ్రవణం 4 మకరం | దేవ | కోతి | అంత్య |
| గా | గీ | గూ | గే | ధనిష్ఠ 2 మకరం 2 కుంభం | రాక్షస | సింహం | మధ్య |
| గో | సా | సీ | సు | శతభిషం 4 కుంభం | రాక్షస | గుఱ్ఱం | ఆది |
| సే | సో | దా | ది | పూ॥భా 3 కుంభం 1 మీన | మనుష్య | సింహం | ఆది |
| దు | శ్యం | ఝూ | థా | ఉ॥భా॥ 4 మీనం | మనుష్య | గోవు | మధ్య |
| దే | దో | చా | చి | రేవతి 4మీనం | దేవ | ఏనుగు | అంత్య |

**విరోధ జంతువులు :** గుఱ్ఱము-దున్న, ఏనుగు-సింహం, మేక-కోతి, పాము-ముంగిస, కుక్క-లేడి, పిల్లి - ఎలుక, గోవు-పులి, **సందిగ్ధంగా ఉన్న పేర్లు :** శ్రీరామ - చిత్త 4వ పా॥, కృష్ణ- మృగశిర 3పా॥ జ్ఞానుడు- ఆరుద్ర 3వ పా॥, భీమ-మూల 3వ పా॥, భైరవ-పూ॥షాఢ 3వపా॥



# దినాధిపతులు - తారాబల గణన చక్రం

నిత్య నక్షత్రమునకు, జన్మ, లేక నామ నక్షత్రమునకు ఎదురుగా ఉన్న గడియందు దినాధిపతిని చూచుకొనవలయును దినాధిపతుల వద్దనున్న సంఖ్య ద్వారా తారబలము తెలుసుకొనవచ్చును

| నిత్య నక్షత్రములు → జన్మ నక్షత్రములు ↓ | | | అశ్విని మఖ మూల | భరణి పుబ్బ పూ॥షాఢ | కృత్తిక ఉత్తర ఉ॥షాఢ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ॥భాద్ర | పుష్యమి అనూరాధ ఉ॥భాద్ర | ఆశ్రేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | మఖ | మూల | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 |
| భరణి | పుబ్బ | పూ॥షాఢ | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 |
| కృత్తిక | ఉత్తర | ఉ॥షాఢ | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర6 | శని 7 |
| రోహిణి | హస్త | శ్రవణం | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 |
| మృగశిర | చిత్త | ధనిష్ట | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు3 | గురు 4 |
| పునర్వసు | విశాఖ | పూ॥భాద్ర | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 |
| పుష్యమి | అనూ | ఉ॥భాద్ర | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 |

1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమిత్రతార ఇందు 1, 3, 5, 7 తారలు మంచివి కావు. 2, 4, 6, 8, 9 శుభప్రదమైనవి. ప్రతి ముహూర్తమునకు తారాబలము తప్పనిసరి



## దినాధిపతులు - ఫలితములు

**1. రవి :** శిరోవేదన, ఉష్ణ సంబంధిత పీడలు, అకాల భోజనం, ధన వ్యయం, కార్యఆటంకాలు. సాహసవంతమైన కార్యక్రమములు చేయుటకు. అధికార దర్శనమునకు

**2. చంద్రుడు :** మనస్సున సుఖం, సంతోషకరమైన మాటలు వినుట, స్త్రీ సౌఖ్యం, గొప్పవారితో స్నేహలాభములు కలుగును. గృహమున శుభకార్యములు చేయుటకు.

**3. కుజుడు :** కలహం, దేహము నలత, సోదర కలహం, స్థల వివాదములు, ఋణములు చేయవలసి వచ్చుట, కార్యాటంకము, దుర్వార్తలు వినుట, భయము, రక్తదర్శనం, శరీరమునకు అనారోగ్యము

**4. బుధుడు :** వ్యాపార లాభములు, బంధు మిత్రులతో ఇష్టాగోష్ఠి, విష్ణుభక్తి, పెద్దవారితో స్నేహలాభములు, నూతన వ్యాపారాదుల కొరకై ఆలోచనలు, కీర్తివృద్ధి, జ్యోతిష, గణిత శాస్త్ర విద్యను అభ్యసించుటకు.

**5. గురుడు :** విద్యా, ఉద్యోగ లాభములు, తేజస్సు, ధర్మకార్యమునకై ధనం ఖర్చు చేయుట, పెండింగు వ్యవహారములు పరిష్కరించుట, మంత్ర సిద్ధి బలము, రాజగౌరవము, స్త్రీ సౌఖ్యం, పండిత సంభాషణ, పెద్దవారితో పరిచయములకు, విద్యా ఉద్యోగ లాభములకు.

**6. శుక్రుడు :** నూతన వస్త్ర, వ్యాపారములు కలిసి వచ్చుట, స్త్రీ సౌఖ్యము, గురుభక్తి, ఇష్ట కార్యసిద్ధి, విందు విలాసములు, కళలయందు ప్రీతి, రావలసిన బాకీలు వచ్చుట జరుగును. సుగంధ ద్రవ్యవ్యాపారాదులకు, నూతన ఆభరణములు ధరించుట.

**7. శని :** మందబుద్ధి, ఏ పని ప్రారంభించినా ఆటంకములు, బంధు వైరములు, మనస్సునవికలం, ద్రవ్యనాశనం, చెడువార్తలు వినుట, నరముల బలహీనత, అనవసరపు ధనవ్యయం.

**8. రాహు :** జంతు భయం, పుత్రులతో విరోధములు, చెడు ఆలోచనలు, నీచులతో స్నేహం, శరీర బాధలు, కోపము అధికం, విధవాస్త్రీ కలహం.

**9. కేతు :** ఆధ్యాత్మిక కార్యక్రమములో పాల్గొనుట, అనవసరపు ధన వ్యయం, అధికారులతో విరోధములు, నేత్రబాధలు, అన్యగ్రామ నివాసం, శత్రు భయము, మనోవిచారం.



# తారాధిపతులు - ఫలములు

## దోష నివారణలు

**ఏ ముహూర్తమును ఆచరించాలన్నా కర్త యొుక్క జన్మలేక నామ నక్షత్రములకు తారాబలము సరిపడి ఉండి శుభగ్రహ తారలను గ్రహించ వలెను.**

**1. జన్మతార : దోష ప్రదము సూర్యుడు అధిపతి :** మనస్తాపము, శిరోవేదన కలిగించును, తప్పని సరి పరిస్థితులయందు నక్షత్ర ప్రారంభం నుండి గం. 2.48 ని॥లు విడిచిపెట్టి మిగతా సమయంలో తోటకూర దానము ఇచ్చి ఉపయోగించవచ్చును.

**2. సంపత్తార : శుభప్రదము బుధుడు అధిపతి :** ద్రవ్యలాభము, ఆనందం, సుఖం, వ్యాపార వ్యవహార లాభము

**3. విపత్తార :** దోషప్రదము రాహు అధిపతి : విరోధములు, చెడు ఆలోచనలు, తప్పనిసరి పరిస్థితులలో నక్షత్ర ప్రారంభం నుండి గం.1-12 ని॥లు విడిచి పెట్టి, మిగతా సమయంలో బెల్లం దానం ఇచ్చి ఉపయోగించవచ్చును.

**4. క్షేమతార : శుభప్రదము గురువు అధిపతి :** తేజస్సు, గౌరవము, కీర్తి లాభము.

**5. ప్రత్యక్తార : దోషప్రదం కేతువు అధిపతి :** అధికార విరోధము, నేత్ర వ్యాధులు, శతృత్వములు తప్పని సరి పరిస్థితిలో నక్షత్ర ప్రారంభం నుండి గం.3-12 ని॥లు విడిచిపెట్టి మిగతా సమయములో ఉప్పు దానం ఇచ్చి ఉపయోగించవచ్చును.

**6. సాధనతార : శుభప్రదము చంద్రుడు అధిపతి :** పెద్దవారితో స్నేహ లాభం, సంతోషము.

**7. నైధన తార : మిక్కిలి దోష ప్రదము శని అధిపతి :** ఏ విషయమునా ఉపయోగించరాదు. వ్యాధి భయం, కార్యాటంకాలు ఈ తారను పూర్తిగా విసర్జించవలయును.

**8. మిత్రతార : శుభప్రదము శుక్రుడు అధిపతి :** సంతోషకరమైన వార్తలు వినుట, కార్యసిద్ధి

**9. పరమమిత్ర తార : శుభా శుభ మిశ్రమము కుజుడు అధిపతి** : దేహమునందు, నలతలు, కార్య ఆటంకములు.

27 నక్షత్రములను, 3 భాగములు చేయగా ఒక భాగమునకు 9 చొప్పున 3 నవకములు ఏర్పడును. ప్రథమ నవకములో జన్మతార 2వ నవకములో విపత్తార 3వ నవకములో ప్రత్యక్తారను విసర్జించవలెను. నైధనతారను పూర్తిగా విడిచిపెట్టవలెను.



## శ్రీ హేమలంబి నామ సంవత్సర ఫలితాంశములు

భగవంతుని యొక్క అనంతమైన ఈ సృష్టిలో కాలం కూడా అనంతమైనదే! ఈ అనంతమైన కాలాన్ని చాలా ఖచ్చితంగా నిర్ధారణ చేసారు మన మహర్షులు. ఈ కాలాన్ని లిప్తల నుండి ఘడియలుగా ఘడియల నుండి రోజులుగా రోజుల నుండి నెలలు సంవత్సరాలుగా, సంవత్సరాల నుండి యుగాలుగా, యుగాలు నుండి మహాయుగాలుగా, మహాయుగాల నుండి మన్వంతరాలుగా నిర్ణయించారు. ఈ సృష్టిని నడిపించే బ్రహ్మదేవునికి 14 మన్వంతరాలు 1 పగలు, 14 మన్వంతరాలు 1 రాత్రిగాను ఇలా 100 సం.రముల కాలం బ్రహ్మకాలమన్నారు. ఇప్పటి వరకు బ్రహ్మకాలంలో 50 సం.రాలు గతించి 7వ దైన వైవ స్వత మన్వంతరములో 27 మహాయుగాలు గతించి 28వ మహాయుగములో కృత, త్రేతా, ద్వాపరయుగాలు గతించి 4వది అయిన కలియుగ ప్రమాణం 4 లక్షల 32 వేల సం.రములలో 5117 సం.రం.లు గతించి 5118వ సంవత్సరము ఈ హేమలంబి నామ సంవత్సరము.

| | | | |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారాబ్ధములు | 5244 | హిజరి | 1437-1438 |
| కలియుగాబ్ధములు | 5118 | ఫసలి | 1425-1426 |
| గౌతమ బుద్ధాబ్ధములు | 2561 | భారతదేశ స్వాతంత్ర్యబ్ధములు | 70 |
| శ్రీ ఆదిశంకరాచార్యబ్ధములు | 2088 | ఆంధ్రరాష్ట్ర అవతరణ | 61 |
| శాలివాహన శతాబ్ధములు | 1939 | క్రీస్తుశకం | 2017-2018 |

శ్లో॥ హేవిళంబౌ నృపాస్సర్వే పరస్పర విరోధన
ప్రజాపీరాత్వ నర్ఘంభ తధాపి సుఖినోజనా:

తా॥ హేమలంబి నామ సంవత్సరమున రాజులు అన్యోన్య విరోధులగుదురు. ప్రజలకు పీడలు కల్గును. అయినను జనులు సుఖవంతులగుదురు.

శ్రీ హేమలంబి నామ సంవత్సరమునకు రాజు కుజుడు, మంత్రి శుక్రుడు, సేనాధిపతి బుధుడు, సస్యాధిపతి నీరసాధిపతి రవి, ధాన్యాధిపతి శని, అర్ఘ్యాధిపతి మేఘాధిపతి గురుడు, రసాధీపతి కుజుడు అగుట వలన 5 ఆధిపత్యములు శుభులకు 4 ఆధిపత్యములు పాపులకు వచ్చినవి. ఆరుద్ర కార్తి రాత్రి ప్రవేశం అయినందున పంటలు అభివృద్ధిగా ఉంటాయి. బహుళ త్రయోదశి తిథి వలన గురువారం రోజు వలన జలముచే భూమి నిండును. అధికమగు ధరలు కలిగియుండును.

పశుపాలకుడు యముడైనందున పశు సంపదకు కొంత అరిష్టదాయకం. స్వల్ప వృష్టి, అల్ప క్షీరము, అల్ప తృణము కలిగించును. గోష్ట ప్రావకుడు - గోష్ట బహిష్కర్త శ్రీకృష్ణుడు అయినందున కొంత పశు అరిష్టమును తగ్గించును.

ఈ సంవత్సరములో 2 తూములు వర్షము కురియును. 60 యోజనములు విస్తీర్ణము 100 యోజనములు ఎత్తు గల వర్ష ప్రమాణములో 10 భాగములు సముద్రములోను, 7 భాగములు పర్వతములపైన 2 భాగములు భూమి పైన వర్షించును. ఈ సంవత్సరము కాలనామ మేఘం మేరు పర్వతానికి దక్షిణ దిగ్భాగములో ఉద్భవించినందున అధిక వర్షములు కురియును. మధ్య దేశములు అధిక జలముతో నిండును. అన్ని ధాన్య జాతులు ఫలించును. ఎరుపురంగు ధాన్యములు బాగుగా పండును.

## ఉపనాయక నిర్ణయము

శ్లో॥ క్రూర గ్రహఫలం క్రూరం శుభగ్రహఫలం శుభం
పురోహితాది సర్వేషాం భవదీశ సముద్భవం

తా॥ పురోహితాది ఉపనాయక ఫలములన్నీయు, పాప గ్రహాలు, పాప ఫలమును శుభగ్రహాలు శుభ ఫలములను కలిగించును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాష్ట్రాధిపతి | – | కుజుడు | శుభాధిపతి | – | కుజుడు |
| స్త్రీణాధిపతి | – | గురుడు | దేవాధిపతి | – | రవి |
| వృక్షాధిపతి | – | శని | జంగమాధిపతి | – | రవి |
| అశ్వాధిపతి | – | శుక్రుడు | సర్వదేశాద్యోగి | – | శుక్రుడు |
| నరాధిపతి | – | బుధుడు | పరీక్షకుడు | – | శని |
| గణకాధిపతి | – | కుజుడు | సర్వాధిపతి | – | కుజుడు |
| గ్రామ నాయకుడు | – | శని | పురోహితుడు | – | రవి |
| దైవజ్ఞుడు | – | బుధుడు | వస్త్రాధిపతి | – | కుజుడు |
| పశునాయకుడు | – | గురుడు | మృగాధిపతి | – | బుధుడు |
| గ్రామ పాలకుడు | – | గురుడు | రత్నాధిపతి | – | గురుడు |
| శుభులు –9 పాపులు –12 | | | గజాధిపతి | – | రవి |

## యోగ పంచకములు

1. **జ్యేష్ఠ శుక్ల పాడ్యమి :** శుక్రవారము అగుట వలన జనులకు సుభిక్షము కలిగి క్షేమ, ఆరోగ్యవంతులై ఉందురు. మంచి వర్షములు పడి పంటలు పండును.
2. **ఆషాడ శుక్ల పంచమి :** బుధవారం ఆగుట వలన సుభిక్షము, శరీరమునకు ఆరోగ్యము కల్గును.
3. **ఆషాఢ శుక్ల నవమి :** చిత్త నక్షత్రం ఆగుట వలన అన్ని పంటలు సమృద్ధిగా పండి, ప్రజలు ఆనందంగా ఉందురు.
4. **ఆషాఢ బహుళ ద్వాదశి :** రోహిణి నక్షత్రం అగుట వలన అన్ని పంటలు నశించును.
5. **పుష్య బహుళ అమావాస్య :** బుధవారం అగుట వలన పశువృద్ధి ఎక్కువగా కలుగును.

## నవ నాయక ఫలములు



1. **రాజు - కుజుడు ఫలితము :** కుజుడు రాజైనందున రాజ విరోధములు అధికముగా ఉండును. దేశంలో అగ్ని ప్రమాదములు దొంగల భయము అధికమవును. ప్రజల్లో అనారోగ్య సమస్యలు అధికమౌవును. భూమి సస్యరహిత మగును. సర్పభయము. రాష్ట్రంలో సమ్మెలు. తిరుగుబాట్లు కలహములు హెచ్చు పెరుగును.
2. **మంత్రి- శుక్రుడు ఫలితము :** శుక్రుడు మంత్రి అయినందున ధాన్యము విశేషముగా పండును. గోవులు సమృద్ధిగా పాలిచ్చును. సస్యానుకూల వర్షములు కురియును. స్త్రీ పురుషులు విందులు విలాసాలతో జీవింతురు. ప్రజలు ధర్మనితరులగుదురు.
3. **సేనాధిపతి - బుధుడు ఫలితములు :** బుధుడు సేనాధిపతి అయినందున వాయువుతో కూడిన మేఘములు ఒక్కొక్కప్పుడు వర్షించును. పంటలు పూర్ణముగా పండును. స్త్రీ, పురుషులు విలాసవంతముగా జీవింతురు. దేశంలో అంతర్గత శత్రువులు విజృంభన, తిరుగుబాట్లు ఉండగలవు. రక్షణ శాఖ చాలా జాగ్రత్తగా వ్యవహరించకపోతే అసమర్ధతగా చిత్రీకరించబడును.
4. **సస్యాధిపతి- రవి ఫలితము :** రవి సస్యాధిపతి అయినందున గోధుమ, యవ, ఉలవలు, శనగలు మొదలగు ధాన్యములు పూర్ణముగా ఫలించును. రేవడి నేలలు, ఎర్రనేలలు, ఎరుపు పంటలు బాగుగా పండును.
5. **ధాన్యాధిపతి - శని ఫలితము :** శని ధాన్యాధిపతి అయినందున నల్ల ధాన్యములు, చిరుధాన్యములు సమృద్ధిగా పండును. నల్ల నేలలు పుష్యలంగా పండును.
6. **అర్ఘాధిపతి - గురుడు ఫలితము :** గురుడు అర్ఘాధిపతి అయినందున భూమి సువృష్టితో ధనధాన్య సమృద్ధితో తులతూగును. బ్రాహ్మణులు యజ్ఞ యాగాదులపై ఆశక్తి చూపుతారు. మంగళ వాయిద్యాలతో ఉత్సవములు జరుగును. సస్యములు ధరవరలు బాగుండును.
7. **మేఘాధిపతి - గురుడు ఫలితము :** గురుడు మేఘాధిపతి అయినందున భూమి సస్యశ్యామలంగా ఉంటుంది. ధరలు సరసంగా ఉంటాయి. వర్షాలు సమృద్ధిగా కురుస్తాయి. ప్రజలు ఆరోగ్యంగా జీవిస్తారు.
8. **రసాధిపతి - కుజుడు ఫలితము :** కుజుడు రసాధిపతి అయినందున జీలకర్ర, ఉప్పు, నువ్వులు, నూనె, నెయ్యి, బెల్లం మొదలైన రసవస్తువులు ధరలు తగ్గును.
9. **నీరసాధిపతి - రవి ఫలితము :** రవి నీరసాధిపతి అయినందున బంగారం, వెండి, రాగి, మంచిగంధము, కెంపు, ముత్యాలు వృద్ధి పొందుతాయి కానీ ప్రజలలో అశాంతి, కలహములు కలిగించును. లోహ జాతులు ధరలు తగ్గును.

# శ్రీ హేమలంబి నామ సంవత్సర వర్ష లగ్న జగల్లగ్న ఫలితములు

| | | |
|---|---|---|
| | ల కు బు | ర చం శు కే |
| | వర్షలగ్నం | |
| రా గు | | శ |

| | | |
|---|---|---|
| కు | ర బు | శు కే |
| | జగల్లగ్నం | ల |
| రా గు | చం | శ |

**28.03.2017 మంగళవారం ఉగాది**

శ్రీ హేమలంబి నామసంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి ప్రవేశించువేళ వర్ష లగ్నం. ఇది ఉత్తరాభాద్ర నక్షత్రం 4వ పాదం మీనరాశి మేషలగ్నం అయినది. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించువేళ జగల్లగ్నం. ఇది విశాఖ నక్షత్రం 3వ పాదం తులారాశి మకరలగ్నం అయినది.

బ్రహ్మాండములో సూర్యభగవానుడు సంచారము చేస్తూ భూమండలాన్ని పరిపాలించడానికి 9 ప్రధాన శాఖలు (నవనాయకులు) 21 ఉపశాఖలు (ఉప నాయకులు)గా విభజించి ఈ శాఖలకు సూర్యాది సప్తగ్రహములకు ఆధిపత్యములు కలిగిస్తూ సకల జీవరాశి మనుగడలో ప్రారబ్ధానుసారముగ శుభాశుభాలను కలిగిస్తూ పరిపాలింప జేయుచున్నారు.

నవనాయకులు, ఉపనాయకులు, వర్షలగ్నం, జగల్లగ్నం వలన ప్రపంచములో జరుగు సమస్త శుభాశుభములు అనేక ముఖ్య సంఘటనలు, రాజకీయ పరిణామాలు. ప్రకృతి వైపరీత్యాలు మొదలైన ఎన్నో అంశములను విచారింప వచ్చునని మహర్షులు మనకు అందించిన జ్యోతిష్యశాస్త్రం తెలియజేస్తున్నది. కాశీ విశ్వేశ్వరుని కృప వలన గాయత్రీ మాత కరుణ వలన– వారందించిన పరిజ్ఞానం మేరకు విషయములు వివరించుచున్నాను– వ్రాసిన వాటిలో కొన్ని అంశములు యధాతథముగా జరగవచ్చును, కొన్ని అంశములు జరగపోవచ్చును, జరిగిన అంశములకు జ్యోతిష్యశాస్త్రం యొక్క గొప్పతనమే అవుతుంది. జరగనివాటికి నా పరిజ్ఞాన లోపమే అవుతుంది.

శ్రీ హేమలంబి నామ సంవత్సరములో రాజు కుజుడు– మంత్రి శుక్రుడు – సేనాధిపతి బుధుడు – సస్యాధిపతి, నీరసాధిపతి రవి– ధాన్యాధిపతి శని – అర్ఘాధిపతి,

మేఘాధిపతి గురుడు- రసాధిపతి కుజుడు- అయి ఉన్నారు. చంద్రునికి ఏ ఆధిపత్యము రాలేదు.

ఈ నవనాయకులలో శుభులకు 5 ఆధిపత్యములు. పాపులకు 4 ఆధిపత్యములు వచ్చినవి. ఉపనాయకులలో శుభులకు 9 ఆధిపత్యములు, పాపులకు 12 ఆధిపత్యములు వచ్చియున్నవి. నవనాయకులలో శుభాధిపత్యం ఎక్కువైనందున పరిపాలనలో ఉన్న ముఖ్యనాయకులలోను, అధికార యంత్రాంగంలోను సమన్వయం బాగుంటుంది. దీనివలన అభివృద్ధికర ప్రణాళికలు ప్రవేశపెట్టగలరు. కానీ ఉపనాయకులలో పాపాధిపత్యం అధికమైనందున క్రిందస్థాయి నాయకులు మరియు అధికార సిబ్బంది వారి లోను పరస్పర విరోధములు. అభిప్రాయ బేధములు ఉండుట వలన ప్రజాహిత కార్యక్రములు కొన్ని కుంటుపడును.

కుజుడు రాజై వర్షలగ్నములో స్వక్షేత్రస్థితిలో బలవంతుడై ఉన్నందున ప్రతిపక్ష విరోధములు అధికముగా ఉన్ననూ సమర్ధవంతంగా పరిపాలన సాగును- కొన్ని రాష్ట్రాలలో ప్రతిపక్షనాయకుల వలన తీవ్ర విరోధములు కలిగి ప్రభుత్వాలు తారుమారు అయ్యే అవకాశములు గోచరించుచున్నవి. ఏ పార్టీ నాయకులైనా వారి వారి పార్టీలను పదవులను కాపాడుకోవాలనే తాపత్రయమే ముఖ్య అంశముగా మారుతుంది. ప్రజాశ్రేయస్సు, సక్రమైన పరిపాలన, నిత్యావసర వస్తువుల ధరలు నియంత్రణ వంటి అంశములను పట్టించుకోరు. రాష్ట్రంలోను – దేశములోను అగ్ని ప్రమాదములు. దొంగతనములు అధికమౌవును. ప్రభుత్వ ధనం ప్రజాధనం అపహారణలు ప్రజలలో అనేక చర్మ సంభందమైన వ్యాధులు, యాక్సిడెంట్లు, అధికముగా జరగవచ్చును.

మంత్రి శుక్రుడై వర్షలగ్నములో వ్యయస్థితిగతుడై ఉచ్ఛస్థితి కలిగి ఉన్నందున, పరిపాలనా విధానములో మంత్రులు తమ, తమ పదవులకు న్యాయం చేయలేని పరిస్థితులు ఏర్పడును. స్త్రీలు మాత్రం, ఆధిక్యత వహించగలరు. దేశంలోను రాష్ట్రంలోను, పాడిపంటలు అభివృద్ధి పొందగలవు.

సేనాధిపతి బుధుడైనందున దేశంలోను రాష్ట్రంలోను అంతర్గత శతృవులు విజృంభనలు–తిరుగుబాట్లు అధికంగా ఉంటాయి. సస్యాధిపతి రవి వలన ధాన్యాధిపతి శని వలన ఎర్రనేలలు నల్లభూములలో గోధుమలు, శనగలు, నల్ల ధాన్యములు, చిరుధాన్యములు సమృద్ధిగా పండును. రసాధిపతి కుజుడు. నీరసాధిపతి రవి అయినందున రసవస్తువులు, లోహజాతులు ధరలు తగ్గును.

ఉపనాయకులలో – పురోహితుడు, దేవాధిపతి, దైవజ్ఞుడు, రవి, బుధుడు అయినందున ప్రజలలో సనాతన హిందూధర్మం పట్ల ఆచారవ్యవహారముల పట్ల విశ్వాసము పెరుగును- దైవచింతన కలిగి యజ్ఞయాగాది వ్రతములు

ఆచరించుతురు. దేవాదాయశాఖ భక్తుల సౌకర్యార్థం. కొన్ని నూతన విధానములు రూపకల్పన చేయును– ఆధ్యాత్మిక సేవాసంస్థలు అభివృద్ధి పొందును.

వస్త్రాధిపతి కుజుడైనందున ఎరుపురంగు వస్త్రములు గిరాకీ పెరుగును. చేనేత పరిశ్రమ వాటికి సంభందించిన సంస్థలు కుంటుపడును– చేనేత జౌళి శాఖ ఆప్కో వంటి సంస్థలు నడపలేక మూత పడే అవకాశాలు గోచరిస్తున్నాయి.

వృక్షాధిపతి శని అయినందున కలప అక్రమ రవాణాలు ఎక్కువగా జరుగును. అటవీ సంపదకు వన్యమృగాలకు నష్టం వాటిల్లును– అటవీశాఖ అవినీతి అక్రమాలు వలన అనేక ఇబ్బందులకు గురి అవును.

వర్షలగ్నమైన మేషమును పరిశీలనచేయగా లగ్న అష్టమాదిపతియైన కుజుడు మేషమందు స్వక్షేత్రస్థితి – ద్వితీయ సప్తమాధిపతయైన శుక్రుడు రవి, చంద్రులతో కలసి వ్యయమందు ఉచ్ఛస్థితి – తృతీయ షష్ఠాధిపతియైన బుధుడు కుజునితో కలసి లగ్నస్థితి – చతుర్ధాధిపతియైన చంద్రుడు రవి శుక్రులతో కలసి వ్యయస్థితి– భాగ్యవ్యయాధిపతియైన గురుడు షష్ఠస్థితి – రాజ్యలాధిపతియైన శని భాగ్యస్థితిలో ఉన్నాడు.

అలాగే జగల్లగ్నము మకరమును పరిశీలించగా లగ్నద్వితీయాధిపతియైన శని వ్యయస్థితి– తృతీయ వ్యయాధిపతియైన గురుడు భాగ్యస్థితి – చతుర్ధ లాభాధిపతియూను కుజుడు పంచమస్థితి– పంచమ రాజ్యాధిపతియైన శుక్రుడు తృతీయలో ఉచ్ఛస్థితి – సప్తమాధిపతియైన చంద్రుడు దశమస్థితి– అష్టమాధిపతి యైన రవి బుధునితో కలసి బుధాధిత్యయోగంలో చతుర్థస్థితి కలిగియున్నారు–

పైవిధముగా రెండులగ్నములను విశ్లేషించగా కొన్ని రంగాలలో అభివృద్ధికర మైన శుభఫలితాలను – కొన్ని రంగాలలో ప్రతికూల పరిస్థితులు గోచరిస్తున్నాయి. వర్ష జగల్లగ్నాధిపతులు కుజ శనులు పరస్పర విరోధభావములు గల గ్రహములగుట వలన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సమన్వయము లోపించును. ధనాధిపతులు శుక్ర శని గ్రహములు వ్యయస్థితిలో ఉండుట వలన రాష్ట్ర దేశ ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా ఉండవు. ఆదాయ వనరులకు మించిన బడ్జెట్ ప్రణాళికలు రూపొందును.

వర్షలగ్నములో ధనకారకుడైన గురువు షష్ఠస్థితి వలన రాష్ట్ర ఆర్థిక విధానములు కలసిరాక రాష్ట్రానికి ఋణభారం పెరుగును– ఆర్థిక మాంద్యం అనేక రాష్ట్రాలను కుదుపివేస్తుంది. రియల్ ఎస్టేటు, ఫైనాన్స్ వ్యాపారాలు అక్టోబరు నుండి కొంతవరకు మెరుగుపడును. ప్రభుత్వ ఆదాయశాఖలలోను బ్యాంకు లావాదేవీలలోను, అనేక మార్పులు జరగవచ్చును–క్రిందస్థాయి విద్యారంగంలో కొన్ని ప్రతికూల నిర్ణయాల వలన ఒడిదుడుకులకులోనై ఉత్తీర్ణతాశాతం తగ్గవచ్చును.

రెండు లగ్నములలోను రాజ్యాధిపతులు శని, శుక్రులు బలవంతులై ఉన్నందున రవి బుధులు, బుధాధిపత్యయోగంలో ఉన్నందున దేశము, రాష్ట్రములు కూడా ఇతర దేశములతో మైత్రి ఒప్పొందాలు. వ్యాపార లావాదేవీలు అనుకూలంగా ఉంటాయి.

కళలకు కారకుడైన శుక్రుడు ఉచ్ఛస్థితి వలన దేశంలో క్రీడారంగం అభివృద్ధి పొందును– అలాగే సినిమా, టి.వి. రంగాలలో నూతన టెక్నాలజీ పెరుగును. నూతన యువతీ యువకులు తెరపైకి రాగలరు– అడుగున పడిపోయిన నాట్యాది కళలు కళాకారులకు ప్రభుత్వ గుర్తింపు ప్రజాదరణ పెరుగును–

జగల్లగ్నంలో బుధాధిపత్యయోగం, గురుడు భాగ్యస్థితి, చంద్రుడు రాజ్యస్థితి వలన ఉన్నత స్థాయి విద్యారంగంలోను–వైజ్ఞానిక, సాంకేతిక వైద్యరంగాలలోను నూతన అంశములు కనుగొనుట వలన మనదేశం ప్రపంచ దేశాలలో ఉన్నతమైన కీర్తిని ఆర్జించగలదు.

సంవత్సర పర్యాంతం గ్రహసంచారమును పరిశీలనచేయగా ది. 6. 2. 2017 నుండి జూన్ 9 వరకు కన్యారాశిలో గురుడు వక్రగతిలో ఉన్నందున ఆర్థిక సంస్థలు, ఫైనాన్సు వ్యాపారాలు, బ్యాంకులు, విద్యాసంస్థలు. ఇవన్నీ ఒడిదుడుకులు కలిగి ఉంటాయి. అలాగే పీఠాధిపతులు మత గురువులకు కొందరిలో అనారోగ్య సమస్యలు. కొందరికి సంకట పరిస్థితులు ఎదురయ్యే సూచన కలదు. ఏప్రియల్ 6 నుండి ఆగష్టు 25 వరకూ శని వక్రస్థితి వలన ఐరన్, ఆయిల్స్, గ్యాస్ మొదలగు వాటి ధరలు తగ్గుట– వాటి కొరత ఏర్పడును– మే 27 నుండి జూలై 11 వరకూ శని కుజులకు సమసప్తక స్థితి వలన రాజకీయరంగంలో అశాంతి. భూవివాదములు, భూకంపాలు వచ్చే అవకాశాలున్నాయి. సెప్టెంబరు 18 నుండి 13. 1. 2018 వరకూ కాల సర్పదోష ప్రభావము వలన దేశ సరిహద్దులలో యుద్ధవాతావరణం కలిగించే సూచన గలదు– రాజకీయంలో ఊహించని మార్పులు రావచ్చును– పార్టీ ఫిరాయింపులు లేదా ఇతర సమస్యలతో రాజకీయ రంగంలో అశాంతి ఒడిదిడుకులు కలిగి ఉండును– సమ్మెలు, తిరుగుబాట్లు, రాస్తారోకోలు, పట్టణాలలోను గ్రామాల్లోను, ఎదో ఒక సమస్యతో ఉద్రిక్త వాతావరణాలు ఉండే అవకాశం ఉన్నది. ప్రకృతి రీత్యా, భారీవర్షాలు, తుఫాన్లు, వరదలు, భూ కంపాలు వంటి ప్రమాదాలలో ఆస్తినష్టం, ప్రాణనష్టాలు కలిగించే గ్రహస్థితులు ఉన్నాయి– పంచభూతాలు కలిగించే విపత్తులను ఆపడానికి మానవ శక్తి చాలదు– ఆ పంచభూతాలను సృష్టించిన భగవంతున్నే రక్షించమని కోరుకుందాం! ప్రపంచశాంతి లోకరక్షనార్థం ప్రతీవారు దైవనామస్మరణతో ఆది దంపతులైన పార్వతీపరమేశ్వరులను, కలియుగదైవమైన శ్రీ వెంకటేశ్వరస్వామి వారిని, ఎవరి ఇష్టదైవాలను వారు ప్రార్థించుకుందాం. రక్షణ పొందుదాం.

**సర్వేజనః సుఖినోభవంతు!**

## ఆరుద్ర నక్షత్ర ప్రవేశము

శ్రీ హేమలంబి నామ సం॥రం జ్యేష్ఠ బహుళ త్రయోదశి బుధవారం కృత్తిక నక్షత్ర యుక్త వృషభలగ్న ధృతి యోగ గరజి భరణమున అనగా ది. 21-6-2017 బుధవారం రాత్రి తె.5.01 ని॥లకు తెల్లవారితే 22 వ తేదీ గురువారం సూర్యుడు ఆర్ద్ర నక్షత్ర ప్రవేశం చేయును.కావున దేశమున మధ్యవృష్టి వర్షములు,వేడి గాలులు,అగ్ని వర్షములు, క్షీర ధాన్యాదులు మధ్యమ పంటలు ధరలు పెరుగును. ప్రజలు పాత కక్షలతో,కోపస్వరూపులై ఉందురు.విద్యార్థులు మంచి తెలివితేటలతో వృద్ధి పొందుదురు.

## గురు దయాబ్ద ఫలము

గురోదయం ఫాల్గుణాబ్ధమున వలన ప్రజలలో చోర భయములు అధికమగును,స్త్రీలకు రక్షణ కరువు అగును,మధ్యమ పాడిపంటలు ఫలించును.అధర్మం ప్రబలి యుండును.

## కర్తరీ ప్రవేశములు

శ్రీ హేమలంబినామ సం॥రం వైశాఖమాస శుద్ధ నవమి,గురువారం అనగా 4-5-2017 వ తేదీ మ.గం.2.38 ని॥నుండి ది.11-5-2017 వ.తేదీ గురువారం మ.గం.12.02ని॥ల వరకు డొల్లుకర్తరి ది.11.5.2017 తేదీ గురు.12.02 ని॥ నుండి ది.28-5-2017 వ తేదీ ఆదివారం 7.32ని॥ వరకు పెద్దకర్తరి త్యాగమగును. ఈ కర్తయందు గృహమునకు సంబందించిన చెట్లు కొట్టుట,తాటి ఆకులు కొట్టుట,చెక్కపని గృహ నిర్మాణము చేయరాదు,దేవాలయ నిర్మాణాది పనులు దూష్యము కాదు.

## గురు మౌఢ్యమి

**( 12.10.2017 లగాయితు 9.11.2017 వకతు )**

ది.12.10.2017 గురువారం రాత్రి గం.7.39 ని॥లకు పశ్చాదస్తమితో గురు: పడమర దిశలో గురుడు అస్తమించుటవలన గురుమౌఢ్యమి ప్రారంభమై 9.11.2017 గురువారం రాత్రి 12.42 ని॥లకు ప్రాగుదితో గురు: తూర్పు దిశలో గురుడు ఉదయించుట వలన గురుమౌఢ్యమి త్యాగమగును.

## శుక్ర మౌఢ్యమి

**( 19.3.2017 లగాయితు 31.3.2017 వరకు )**

గత పంచాంగములో 19.3.2017 తేదీన ప్రారంభమైన శుక్రమౌఢ్యమి ఈ పంచాంగం ప్రారంభంలో అనగా 31.3.2017 శుక్రవారం ఉ.గం.7.15 ని॥లకు ప్రాగుదితో శుక్ర: తూర్పుదిశలో శుక్రుడు ఉదయించడం వలన శుక్రమౌఢ్యమి త్యాగమగును.

**( 28.11.2017 లగాయితు 19.2.2018 వరకు )**

ది.28.11.2017 మంగళవారం రా.గం. 12.20 ని॥లకు ప్రాగస్తమితో శుక్ర: తూర్పుదిశలో శుక్రుడు అస్తమించుట వలన శుక్రమౌఢ్యమి ప్రారంభమై 19.2.2018 సోమవారం రా తె 4.27 ని॥లకు పశ్చాదుదితో శుక్ర: పడమర దిశలో శుక్రుడు ఉదయించడం వలన శుక్రమౌఢ్యమి త్యాగమగును.

## కావేరీ పుష్కరం

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ హేమలంబి నామ సం॥రం భాద్రపద బహుళ సప్తమి మంగళవారం అనగా ది. 12-9-2017వ తేదీ ఉ.గం.6-05 నిలకు దేవగురుడైన బృహస్పతి తులారాశి ప్రవేశం చేయును. ది. 12-9-2017వ తేదీ మంగళవారం నుండి 23-9-2017 శనివారం వరకు పుష్కరములు జరుగును. ఈ కావేరి నదిని పొన్నిదక్షిణగంగ, మార్గనదీ, అమృతధార అని పిలువబడింది. మైసూరులో బ్రహ్మగిరి కొండపైన కావేరి నది ఉద్భవించింది. ఈ నదికి సమీపంలో కావేరిమాత విగ్రహం కూడా ఉంటుంది. కావేరి దేవతగా భక్తులకు దర్శనమిస్తుంది. దీనికి ఉపనదులుగా కడక్, సుజోయితి, భవాని, షింషా హేమావతి, తోకాపాము, నేరు సంధి, భవాష్టక అర్కావతి,తోపైఏరు, శరగంగ, నంద్యామ, మణి మధుర, హోళి, సాగర్ ఘూటి, లక్ష్మణతీర్థ, కౌంభినీమండ,అమరావతి, నాటక ధార, ఇంకా అనేక ఉపనదులు ఈ నదిలో కలుస్తాయి. చిదంబరం, శ్రీరంగం, కుంభకోణం, తంజావూరు ఈ క్షేత్రములలో పుష్కర స్నానం కోటి జన్మల పుణ్యఫలం లభిస్తుంది.

## బార్హాస్పత్య మానాబ్ధ ఫలము

బార్హాస్పత్యమానాబ్ధి సౌమ్య నామ సం॥రము అగుటవలన అనేక సస్యములతో అనుకూల వర్షములతో లోకములు సుభిక్షముగా ఉండును. నాయకులు వైరము కలిగియుందురు.

## దక్షిణాయణ - ఉత్తరాయణ ప్రారంభములు

ది. 16-7-2017 ఆదివారం సా.4.24 ని॥లకు సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశించుట వలన దక్షిణాయనం ప్రారంభమగును. ది.14-1-2018 ఆదివారం ప.1.46 ని॥లకు సూర్యుడు మకర రాశిలో ప్రవేశించుట వలన ఉత్తరాయణం ప్రారంభమగును. ఈరోజే ఉత్తరాయణ పుణ్యకాలం.

## అర్ధగ్రాస -చంద్ర గ్రహణములు

స్వస్తశ్రీ చాంద్రమాన శ్రీహేమలంబినామ సం॥రం శ్రావణశుద్ధ పూర్ణిమ శ్రవణా నక్షత్ర యుక్త మేషలగ్న మకర రాశి యందు ది.7-8-2017 సోమవారం ఆగ్నేయగోళం,అపసవ్యస్థితి,కేతుగ్రస్థ అర్ధగ్రాస చంద్రగ్రహణం రా.10.52 ని॥ చంద్రగ్రహణం సంభవించుచున్నది.

స్పర్శకాలం రా.10.52
మధ్యకాలం రా.11.50
మోక్షకాలం రా.12.49



గ్రహణం ఆద్యంత పుణ్యకాలం గం.1.57

ఈ గ్రహణమును శ్రవణనక్షత్రము,మకరరాశి వారు చూడరాదు. మేష,వృషభ,మకర రాశుల వారు చూడరాదు.

తరువాతి రోజు మంగళవారం ఉదయం గ్రహణదోష పరిహారార్థం. శివాలయమున రుద్రాభిషేకం జరిపించి చంద్రబింబప్రతిమ కేతుబింబ ప్రతిమ,బియ్యం,1 1/4 ఉలవలు దానం ఇవ్వాలి.

## సంపూర్ణ -చంద్ర గ్రహణము

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీహేమలంబి నామ సం॥రం మాఘ శుద్ధ పూర్ణిమ పుష్యమి ప్రయుక్త ఆశ్లేష నక్షత్ర కర్కాటక, సింహలగ్నమున ది. 31-1-2018 తేది బుధవారం సా. 5.20 ని॥లకు సవ్యస్థితి రాహుగ్రస్తం ఈశాన్య గోళం పాక్షిక చంద్రగ్రహణం సంభవించుచున్నది.

స్పర్శకాలం సా. 5.20 నిమీళనకాలం రా. 6.23
మధ్యకాలం రా. 7.01 ఉన్మీలకాలం రా. 7.39
శుద్ధమోక్ష కాలం రా. 8.42

గ్రహణం ఆద్యంత పుణ్యకాలం గం. 32 ని॥లు ఈ గ్రహణమును పుష్యమి, ఆశ్లేష నక్షత్ర జాతకులు కర్కాటక,సింహరాశి వారు చూడరాదు. మరుసటి రోజు గురువారం ఉగ్రహణ దోష పరిహారార్ధం. శివాలయంలో రుద్రాభిషేకం జరిపించి చంద్రగ్రహణం ప్రతిమ రాహు బింబ ప్రతిమ 5 సోలలు బియ్యం,5 సోలలు మినువులు దానములు చేయవలెను.

## సంఖ్యా శాస్త్రము (Numerology)

ప్రతి ఒక్కరూ పేరు (NAME)లో అదృష్టం ఉందా ! దురదృష్టం ఉందా అన్న విషయం తెలుసుకోవడంలో ఆసక్తి చూపుతారు. నామ సంఖ్యను, మార్చుకొని అదృష్టాన్ని విజయ అవకాశాలనుపెంచుకోవడమే. న్యూమరాలజీ విధానం. మీ పేరును ఇంగ్లీషులో వ్రాయండి ఆ అక్షరాలుక్రింద ఈ క్రింద యిచ్చిన చార్టియన్ సంఖ్య విలువల్ని వేసుకొని వాటి అన్నింటిని కూడండి ఇప్పుడు ఏ సంఖ్య వచ్చిందో అది మీకు అదృష్టసంఖ్య. ఆ సంఖ్యను క్రింద ఇచ్చిన మరియొక పట్టిక అదృష్ట సంఖ్యలు, శత్రుసంఖ్యలు చూచుకోండి.

| ఇంగ్లీషు అక్షరాలు | వాటి సంఖ్యలు |
|---|---|
| A I J Q Y | 1 |
| B K R | 2 |
| C G L S | 3 |
| D M T | 4 |
| E H N H | 5 |
| U VW | 6 |
| O Z | 7 |
| F P | 8 |

ఉదాహరణకు
R A M U
2 + 1 + 4 + 6
= 13 (1 + 3)
= 4
4 అదృష్ట సంఖ్య

## అదృష్ట సంఖ్యకు మిత్ర, సమ, శత్రు సంఖ్యలు

| అదృష్టసంఖ్యలు | మిత్ర | సమ | శత్రు |
|---|---|---|---|
| 1-4 | 2-3-7-9 | 5 | 6-8 |
| 2-7 | 1-4-5 | 3-6-8-9 | లేవు |
| 3 | 1-2-4-7-9 | 8 | 5-6 |
| 5 | 1-4-6 | 3-8-9 | 2-7 |
| 6 | 5-8 | 3-7-9 | 1-2-4-7 |
| 8 | 5-6 | 3 | 1-2-4-7-9 |
| 9 | 1-2-3-4-7 | 6-8 | 5 |



# కన్యారాశి

ఉత్తర 2, 3, 4 పా॥
హస్త 1, 2, 3, 4 పా॥
చిత్త 1, 2 పా॥

**ఆదాయం : 5, వ్యయం : 5, రాజపూజ్యం : 5, అవమానం : 2**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 5**

## అదృష్ట సంఖ్యలు-రత్నములు

ఉత్తర నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 1, అదృష్ట రత్నం కెంపు
హస్త నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 2, అదృష్ట రత్నం ముత్యము
చిత్త నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడము

ఉత్తర నక్షత్ర స్త్రీ, పురుషులు కెంపు కుడిచేయి ఉంగరం వ్రేలునకు, హస్త నక్షత్ర స్త్రీ, పురుషులు మృత్యము కుడిచేయి చూపుడు వ్రేలునకు, చిత్త నక్షత్ర సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమును ధరించుట అత్యంత శ్రేయోదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు జన్మరాశియైన కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు ద్వితీయ స్థానమైన తులారాశి లో సంచరించును. శని జూన్ 20 వరకు అర్ధాష్టమ స్థానమున ధనూరాశియందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది తృతీయ స్థానమున వృశ్చిక రాశియందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకు అర్ధాష్టమ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు ద్వాదశ స్థానమున సింహరాశి యందు కేతువు షష్ఠమ స్థానమైన కుంభరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు ఏకాదశ స్థానమున కర్కాటక రాశియందు కేతువు పంచమ స్థానమున మకరరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు సెప్టెంబరు 12 వరకూ జన్మరాశి కన్యారాశియందు సంచారము వలన తరచూ కోపము, తెగింపు ఎక్కువగా ఉండుట. గృహమున అనారోగ్యములు వలన అనుకొన్న పనులు ఫలించక, మానసిక ఆందోళనకు గురి అగుట, భార్య తరపు వారి వలన కలహములు, కీర్తితగ్గుట. మనపై అధికారులవలన కాని పెద్దవారి ఆగ్రహమునకు గురిఅగుట, ఉద్యోగస్తుల సాటి ఉద్యోగులతో ఇబ్బందులు వ్యాపారస్తులకు లావాదేవీలు జరగక ఇబ్బంది, మనసు, మాట, బుద్ధి అదుపులో లేక విపరీత మంచి, చెడు ఆలోచనలు తరచూ భయము లేక ఆందోళనకు గురి అగుట. తరువాత సంవత్సరాంతం వరకూ కుటుంబమునందు వివాహాది శుభకార్యాలు కలిసివచ్చుట.

గత రెండు సం॥రములుగా ఉన్న యిబ్బందులు నుండి బయటపడుట పిల్లలు చదువులు లేక ఉద్యోగములు వలన మనస్సు ఆనందముగా యుండుట , రాజకీయ నాయకులుకు పదవీయోగము, ధనవృద్ధి, నూతన పరిచయాలు కలిసివచ్చుట వ్యవహారములు చేయుటవలన ఆనందము. శని జూన్ 20 వరకూ అర్ధాష్టమ స్థానమున ధనూరాశి సంచారము వలన అంత అనుకూలము కాదు. ధన, ఆరోగ్య రూపముగా యిబ్బందులు, హృదయ సంబంధిత, నరాల సంబంధిత అనారోగ్యములు, శరీరమున వాతము పెరుగుట, విద్యార్థుల బాగా కష్టపడినా తగిన ర్యాంక్స్ లేకుండుట. శత్రువులతో యిబ్బందులు, మాటకు విలువలేకుండుట. ఎంత ఆస్తి, ధనము ఉన్ననూ సమయమునకు ధనము చేతికందక యిబ్బందులకు గురిఅగుట, ఇన్‌కమ్‌టాక్స్‌వారితో యిబ్బందులు నమ్మకద్రోహమునకు గురి అగుట, అక్టోబరు 26 వరకు శని తృతీయస్థాన సంచారము కొంత ఊరట తరువాత సంవత్సరాంతం వరకూ అవమానములు శని అంత యోగకారకుడు కాదు రాహువు ఆగష్టు 17 నుండి యోగప్రదుడు అనుకొన్నవి కొంచెం ఆలస్యమయినా పూర్తి కాగలవు. అధికారయోగం, గృహమున మంగళకరమైన కార్యములు పూర్తికాగలవు. ఉద్యోగాభివృద్ధి కేతువు ఆగష్టు నెల నుండి పంచమరాశి మకరరాశి యందు సంచారము వలన శుభాశుభ మిశ్రమమును మొత్తముగా ఈ రాశివారి సామాన్య ఫలములే యిత్యాదిఫలం. విద్యార్థులకు శ్రద్ధ అవసరము. ఉద్యోగులకు ఉపాధ్యాయు లకు పరీక్షాకాలము వ్యాపారస్తులకు మిశ్రమ ఫలితములు. వృత్తిపరులకు సాంకేతిక శాస్త్రకళాకారులకు మిశ్రమ ఫలితములు. ఇంగ్లీషు, సైన్స్ కోర్సులయందు శ్రద్ధ వహించాలి. ప్రభుత్వ, ప్రైవేటు, డాక్టరు, ఇంజనీరు శాఖలతో పనిచేయు వారలకు అభివృద్ధి. రాజకీయ నాయకులకు అంత అనుకూలము కాదు, పోలీసు, కోర్టు, ఫ్యాన్సీ, వడ్రంగి, బంగారు వస్తువులు తయారీ వారికి ఆర్థికంగా మేలు కలుగును.

**దోష పరిహారం :** ఈ రాశివారికి జన్మగురుడు. అర్ధాష్టమ శని దోషప్రదులు గురునికి, శనికి జపశాంతులు జరిపించాలి గురువారం $1^1/_4$ కేజీ శనగలు **శనికి :** తిలదానం యివ్వాలి గృహమునందు గణపతిహోమం, సుదర్శన హోమం జరిపించినా మంచి ఫలములు పొందుతారు. ఆర్థికంగా యిబ్బంది ఉన్నవారు. గణపతి ఆలయమున చెరకురసంతో గురువారం 5 వారములు అభిషేకం, సహస్ర దూర్వార్చన జరిపించి 3 శనివారము విష్ణుమూర్తికి సహస్ర తులసీదళార్చన జరిపించినా మంచి శుభఫలితములు తప్పక పొందుతారు. గురు, శనివారము నియమాలు పాటించాలి **"నవగ్రహ రక్ష"** ధరించాలి.

**ఏప్రియల్ :** ఆదాయం మించిన ఖర్చులు, ధనం ఏదో విధంగా చేతికి అందుట, వ్యాపార వ్యవహారముల అనుకూలించుట, సన్మానము, దైవకార్యముల కొరకై ధనము వెచ్చించుట, మీ క్రింద పనిచేయువారివల్ల ఇబ్బందులు మాసము చివరిలో అపవాదులు.

**మే :** స్థిరాస్థి కలసివచ్చును. పాతపనులు నెరవేరుట, ప్రేమ వ్యవహారాలు దెబ్బతినుట, కుటుంబ కలహాలు, పట్టుదల అధికంగా ఉండుట, దేవాలయ దర్శనములు కాంట్రాక్ట్ దారులకు ధనం చేతికి అందుట.

**జూన్ :** సినీ పరిశ్రమ వారికి కలసివచ్చును. ప్రయాణములు అధికము శుభకార్యములు కలసి వచ్చును. జాయింటు వ్యాపారస్తులకు జాగ్రత్త అవసరము మీ మనస్సు మీ ఆధీనంలో లేకుండుట నూతన వ్యాపారములు కలిసి వచ్చును.

**జూలై :** ప్రయత్నించిన కార్యములు అనుకూలించుట మీ క్రింద పనిచేయువారి వల్ల సమస్యలు, ఆదాయం పెరుగును, కోర్టు సంఘ వ్యవహారం యందు జయం పొందుట, వాహనయోగం, దైవ సంబంధిత కార్యములు యాగముల కొరకై ధనము ఖర్చు చేయుట.

**ఆగస్టు :** ఆదాయం మించిన ఖర్చులు ధనము ఏదో విధంగా చేతికి అందుట వ్యాపార వ్యవహారములు అనుకూలించుట, సన్మానములు, దైవ కార్యక్రమములో పాల్గొందురు. జాయింటు వ్యాపారస్తులకు జాగ్రత్త అవసరము నూతనగృహములకు అనుకూలము.

**సెప్టెంబర్ :** మీ వద్ద పనిచేయు వారితో ఇబ్బందులు వ్యాపార ఒడిదుడుకులు మీ భాగస్వామితో సఖ్యత, శ్రమకు తగ్గ ఫలితము విదేశీప్రయత్నములు కలసి వచ్చుట తేజస్సు పెరుగుట నూతన వ్యక్తుల పరిచయాలు ఇష్టములు సిద్ధించుట వస్తువస్త్రలాభములు.

**అక్టోబర్ :** వేళదాటిన భోజనాలు, శరీరమందు బాధ, మనస్సున విపరీత ఆలోచనలు, బంధుమిత్రాదులతో విరోధములు చోరభయము, ఆయధముల వలన దెబ్బలు తగులుట, మనస్సున భయాందోళన, కృషి లేకుండుట అన్ని కార్యములు విఘ్నమగుట.

**నవంబర్ :** జీవనం సాఫీగా ఉండును స్థిరాస్థివృద్ధి, డాంభికం అధికంగా ఉండుట తీర్థయాత్రలు, ధర్మ కార్యమునకై ధన వ్యయము సాహస కార్యములు చేయుట అధికారుల మన్నలను పొందుదురు పితృ సంబంధిత ఆస్తికలసివచ్చును.

**డిసెంబర్ :** అధికారులతో జాగ్రత్త అవసరము స్త్రీ పరిచయాలు, సోదరి సహకారం, మే కి కింద పనిచేయు వారితో విరోధాలు, కోపం ఆధిక్యత పెరుగును. ఆదాయం సరిపోకుండుట, నరఘోష అధికము, ఆలోచనలు పెరుగును.

**జనవరి :** ద్రవ్యలాభము, మనస్సుల సౌఖ్యము స్త్రీ వ్యామోహము ప్రయత్నించిన కార్యములు కలసి వచ్చుట, పెద్దవారితో పరచయాలు నూతన వస్తు వస్త్ర లాభములు, దైవ సంబంధిత ధన వ్యయం ఇంటియందు సఖ్యత.

**ఫిబ్రవరి :** ఈ మాసము శుభప్రదముగా ఉండును ఉన్నతాధికారుల ప్రోత్సాహం లభించుట, ఇంటియందు శుభకార్యములు కలసి వచ్చుట. మానసిక ధైర్యము, చేయు వృత్తి, వ్యాపార, ఉద్యోగముల లాభములు చేకూరుట ఆభరణములు కొనుగోలు చేయుట.

**మార్చి :** ఆదాయం మించిన ఖర్చులు, ధనము ఏదోవిధంగా చేతికి అందుట వ్యాపార వ్యవహారములు అనుకూలించుట, సన్మానాదులు దైవకార్యములు కొరకై ధనము వెచ్చించుట, మీ కింద పని చేయువారివల్ల ఇబ్బందులు.



# తులారాశి

చిత్త 3, 4 పా॥
స్వాతి 1, 2, 3, 4 పా॥
విశాఖ 1, 2, 3 పా॥

**ఆదాయం : 2, వ్యయం : 8, రాజపూజ్యం : 1, అవమానం : 5**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 6**

## అదృష్ట సంఖ్యలు-రత్నములు

చిత్త నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడము
స్వాతి నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 4 అదృష్ట రత్నం గోమేధికం
విశాఖ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం

చిత్త నక్షత్ర స్త్రీ, పురుషులు పగడము కుడిచేయి ఉంగరం వ్రేలునకు, స్వాతి నక్షత్ర స్త్రీ, పురుషులు గోమేధికం కుడిచేయి మధ్య వ్రేలునకు, విశాఖ నక్షత్ర స్త్రీ, పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు ధరించాలి. రత్న సబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట అత్యంత శ్రేయోదాకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు ద్వాదశ స్థానమున కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు జన్మరాశియైన తులారాశి యందు సంచరించును. శని జూన్ 20 వరకు తృతీయ స్థానమున ధనూరాశియందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది ద్వితీయ స్థానమున వృశ్చిక రాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు తృతీయ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు ఏకాదశ స్థానమున సింహరాశి యందు కేతువు పంచమ స్థానమున కుంభరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు దశమ స్థానమున కర్కాటక రాశియందు కేతువు అర్ధాష్టమ స్థానమున మకరరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు సెప్టెంబరు 12 వరకూ ద్వాదశరాశి కన్యారాశిలోను తదుపరి సంవత్సరాంతం వరకూ జన్మరాశి తులారాశిలోను సంచరించును. ఈ సం॥రం గురుడు దోషప్రదుడు. పూర్వార్థం అంతయూ ధనవ్యయం అధికమగుట శుభమూలక ధనవ్యయం. పాత ఋణములు తీర్చుటకొరకై కొత్త ఋణములు చేయుట, నమ్మినవారికి మధ్యవర్తులుగా ఉండి యిబ్బందిపడుట స్థానచలనము లేక ముఖ్యమైన స్థలములు అమ్ముట లేక తాకట్టుపెట్టుట, ధనము కొరకై యిబ్బందులు, ద్వితీయార్థమున అన్నిచోట్లా విరోధములు, మతిమరుపు, భయము, క్రూరమైన మాటలుపడుట, పట్టుదలకు వెళ్లి యిబ్బంది కొని తెచ్చుకొనుట. విద్యార్థులకు ఈ సం॥రం పరీక్షలకు బాగా కష్టపడినా అర్ధశాతం బాగుంటుంది. మనస్సు ఆందోళనగా డోలాయమానంగా ఉ

ఒడును. శని జూన్ 20 వరకు తృతీయస్థానమున ధనూరాశి ఈ సంచారము ధనము, స్నేహ, బంధు రూపములో ఏదో కారణముగా చేతికందును. పాతబాకీలు కొద్దిగా వసూలు, నూతనపరిచయాలు, సొంతగ్రామము చేరుకొనుట. విదేశములలో ఉండి యిబ్బంది పడుచున్నవారు సొంతదేశము చేరి ఆనందించుట, ఆరోగ్యము కుదురుపడుట, సొంతనిర్ణయాలు కలిసివచ్చుట, అక్టోబరు 26 వరకు మరల వక్రగతితో శని ద్వితీయస్థానమున ఏలినాటి శనిగా వచ్చుట కష్టములు. కారణము లేనిదే నిందపడుట, పాప చింతన, అనవసరపు ప్రయాణాలు, మరల సంవత్సరాంతం వరకు ధనూరాశి యందు శని సంచారము. శుభాశుభ మిశ్రమం రాహువు ఆగష్టు 17 వరకు ఏకాదశ స్థానసంచారము. శుభఫలితములు, అనుకొన్న పనులు పూర్తి. ధనాదాయం తరువాత సంవత్సరాంతం వరకు ప్రతీమాట చేతలయందు జాగ్రత్త అవసరము. ఆగష్టు 17 నుండి మకరరాశి అర్థాష్టమస్థాన సంచారము వలన కేతువు అంత అనుకూలము కాదు. మనస్సు స్థిమితముగా లేకపోవుట, మెడ, భుజములు, నేత్ర, చర్మ ఏదో భాగమునకు అనారోగ్యముతో వేధించుట ఉద్యోగులకు ఏదో విధముగా అవకాశము వచ్చినా చివరిలో ఆటంకము వచ్చుట. చిన్నపిల్లలకు అనారోగ్యములు, భూతప్రేత పిశాచ బాధలు, అత్తవారితో మనస్పర్థలు. బంధు స్నేహ, మనస్పర్థలు మానసిక ఆందోళన, రాజకీయ నాయకులకు వ్యవహార చిక్కులు క్రింద స్థాయి కార్యకర్తలతో విరోధాలు స్థిరాస్తి అమ్మకాలు, పిల్లలు చదువులు , ఉద్యోగ, వివాహ విషయములందు ఆటంకాలు సామానులు నిల్వచేయు వ్యాపారస్తులకు ధన నష్టములు, వ్యవసాయదారులకు పెట్టుబడులు అధికము, దొంగల భయము, జంతువుల భయము, వాహన ప్రమాదములు, నమ్మక ద్రోహులు, అపనిందలు అవమానములు, మనస్సు స్థిమితముగా లేకపోవుట మేడ, భుజములు, కాళ్ళు సంబంధిత అనారోగ్యములు తరచూ వేదించుట వైద్యరంగంలో ఉన్నవారికి పిల్లలు వలన ఇబ్బందులు, మార్బుల్, స్టేషనరీ, పూలు, పండ్లు, తృణధాన్యాలు, స్టూడియో, టి.వి, సినీ రంగాల వారికి మానసిక ఒత్తిడి అపనిందలు.

**దోష పరిహారం :** ఈ రాశివారు గురు, కేతువులకు దోష పరిహారార్థమై గురునికి 16వేలు, కేతువుకి 7వేలు జపశాంతులు జరిపించి శనివారము శివాలయమున రుద్రాభిషేకం $1^1/_4$ కేజీ ఉలవలు దానం యివ్వాలి. గురువారం అభిషేకం జరిపించి $1^1/_4$ కేజీ శనగలు దానం చేయాలి. గృహమునందు సత్యన్నారాయణ వ్రతము జరిపించి అన్నశాంతి చేయాలి. దుర్గాష్టమి పర్వదినాన నుంచి విజయదశమి వరకు అమ్మవారిని గృహమున ప్రతిష్ఠించి నియమానుసారం అమ్మవారిని పూజించిన అమ్మదయతో సంపూర్ణ మనఃశాంతి కలుగును. **"సిద్ధిరక్షను"** భార్యాభర్తలు యిరువురూ ధరించుట శుభప్రదము.

**ఏప్రియల్ :** మీ మాటకు ఎదురు లేకుండుట, అనుకోని విధంగా ధనము చేతికి అందుట వాహన, గృహ లాభములు. ప్రయత్నించిన కార్యములు అనుకూలించుట, భార్య పిల్లలతో స్వల్ప విరోదాలు, సంతాన ఒత్తిడి, అన్నదమ్ముల మధ్య స్వల్ప విరోధులు, కోర్టు వ్యవహారములు వాయిదా పడుట, ఇంటి పనులు ఆలస్యంగా పూర్తి అగుట.

**మే :** మనశ్శాంతి లేకుండుట, అపనిందలు, కుటుంబ వ్యవహారముల రీత్యా శుభమూలక్ ధన వ్యయం ఆదాయం మించి ఖర్చులు, మాట్లాడితే విరోదాలు, స్థిరాస్థి అమ్మకాలు, మేనమామతో మాట మాట పట్టింపులు, బంధువర్గం వారితో చిన్న చిన్న విషయంలో పట్టింపులు.

**జూన్ :** శుభాశుభ మిశ్రమము, మీ మాట వల్ల ఇతరులు మోసపోవుట, ధనాదాయం బాగుండును, వృత్తిపరమైన మార్పులు, అనుకూలం వృధా ప్రయాణాలు బందు సఖ్యత, స్నేహితులకు మీకు మాట మాట పట్టింపులు నరఘోష అధికంగా ఉండును.

**జూలై :** కార్యాటంకాలు వృధాప్రయాణాలు, అకాల భోజనాలు ప్రయాణము యందు జాగ్రత్త అవసరము, సర్ప భయం ప్రతీ పనికి వాయిదా వేయుట ఇతరులను నిందించుట, ఇంటా బయటా విరోధములు, విందు వినోదాల యందు పాల్గొనుట, స్త్రీల యందు జాగ్రత్త అవసరము.

**ఆగష్టు :** తోబుట్టువులతో విరోదం, భూమి తగాదాలు, ఇతరులపై రోజూ కోపము అధికమగుట, స్థాన మార్పులు, ఇంటాబయటా విరోదములు, అత్తవారిలో తగాదాలు, మనోనిబ్బరం, ధనం నిల్వలేకుండుట, వాహన ప్రమాదములు.

**సెప్టెంబర్ :** కోర్టు వ్యవహారములతో చిక్కులు తీరుట, పెద్దవారితో పరచయాలు కార్యసిద్ధి, గృహాలంకరణకై ధనము ఖర్చు చేయుట, తీర్ధ యాత్రలు ఇంటా బయట గౌరవము, నూతన మిత్రుల కలయిక, ఋణములు తీర్చగలరు. కాంట్రాక్ట్‌దారులకు అనుకూలము, ఇంటి యందు శుభకార్యములు.

**అక్టోబర్ :** నూతన వస్తు వస్త్రాదులు కొనుట, వినోదముల కొరకై ధనము ఖర్చు, ఇంటి యందు అలంకార వస్తువులు కొనుట ఆదాయం ఎంత వచ్చినను ఖర్చు అధికం, అపనిందలు మీదపడుట, చిన్న చిన్న గాయాలు, పై అధికారుల ఒత్తిడి, చెప్పుడు మాటలు వినడం వల్ల ఇబ్బందులు, జ్ఞాపకశక్తి మందగించుట.

**నవంబర్ :** మాట్లాడితే విరోధాలు, ఇంటా బయటా భయాందోళనలు ధనవ్యయం అధికము, ఋణములు చేయుట, కార్యహాని, మిత్రుల సలహా సహకారములు అందుట , భార్యకు స్వల్ప అనారోగ్యము, ప్రతీ పనియందు అలసట, అధికారుల ఒత్తిడి, కలహములు, అధికము, వృత్తియందు స్వల్ప అనుకూలం.

**డిశెంబర్ :** మీ మాటకు ఎదురులేకుండుట, కార్యహాని, మీ మాటలవల్ల ఇతరులు మోసపోవుట, కోర్టు వ్యవహారములు తీరుట, పెద్దవానితో పరిచయాలు, గృహాలంకణకై ధనము ఖర్చు చేయుట, ఇంటా బయటా గౌరవము, పాత మిత్రుల కలయిక ఋణములు తీర్చుట, వృత్తిపరమైన మార్పులనుకూలం.

**జనవరి :** నూతన పెట్టుబడులు అనుకూలించుట ఇంటియందు నూతన వస్తువులు కొనుట, ధనాదాయం బాగుండును. పెట్టుబడులు అనుకూలించుట, సంఘము నందు గౌరవములు, భూ సంపాదన, ఏదో విధంగా ధనము చేతికి అందుట గృహమున శుభకార్యములు.

**ఫిబ్రవరి :** అనుకున్న పనులు పూర్తి అగుట మనస్సునందు ఉత్సాహము తేజస్సు దైవకార్యములు కొరకై ధనం, కాలం వెచ్చించుట, వ్యసనములకొరకై ధనము ఖర్చు, గృహ నిర్మాణాది పనులు ప్రారంభం చేయుట, తీర్ధయాత్రలు చేయుట, పెద్ద వారియందు భక్తి, గొప్ప వారి పరిచయాలు.

**మార్చి :** ఆదాయం తగ్గును, ఇంటి యందు అనారోగ్యం, వృధాఖర్చు శారీరక శ్రమ అధికం, కోపము, చికాకులు, శుభకార్యములు కలసిరాకుండుట అభిప్రాయ భేధాలు, కీళ్ళ నొప్పులు, కోర్టు తగాదాలు బంధువుల రాకపోకలు, భార్య తరపు వారిలో విరోధాలు.



# వృశ్చికరాశి

విశాఖ 4 పా॥
అనూరాధ 1, 2, 3, 4 పా॥
జ్యేష్ఠ 1, 2, 3, 4 పా॥

**ఆదాయం : 8, వ్యయం : 14, రాజపూజ్యం : 4, అవమానం : 5**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 9**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

విశాఖ నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం
అనూరాధ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 8, అదృష్ట రత్నం నీలము
జ్యేష్ఠ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 5, అదృష్ట రత్నం పచ్చ.

విశాఖ నక్షత్ర స్త్రీ, పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు, అనూరాధ నక్షత్ర స్త్రీలు నీలముఎడమ చేయి మధ్య వ్రేలునకు, పురుషులు కుడిచేయి మధ్య వ్రేలునకు, జ్యేష్ఠ నక్షత్ర స్త్రీ, పురుషులు పచ్చ కుడిచేయి చిటికిన వ్రేలును ధరించాలి. రత్న సంంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట అత్యంత శ్రేయోదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు ఏకాదశ స్థానమున కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు ద్వాదశ స్థానమున తులారాశి యందు సంచరించును. శని జూన్ 20 వరకు ద్వితీయ స్థానమున ధనూరాశియందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది జన్మరాశి స్థానమున వృశ్చిక రాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు ద్వితీయ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు దశమ స్థానమున సింహరాశి యందు కేతువు అర్ధాష్టమ స్థానమున కుంభరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు నవమ స్థానమున కర్కాటక రాశియందు కేతువు తృతీయ స్థానమున మకరరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలనచేయగా గురుడు సెప్టెంబరు 12 వరకూ ఏకాదశస్థానమున కన్యారాశియందు గురుడు బలవంతుడు కీర్తిప్రతిష్ఠలు వృద్ధిచెందును. సాధించలేని పనులు అన్నియు పూర్తి అగుట గౌరవ అధికారములు, ఆగి ఉన్న ప్రమోషన్‌లు వచ్చుట, శుభకార్యములు కలిసివచ్చును. నూతన వ్యక్తుల పరిచయాలు, విద్యార్థులకు యోగవంతముగా ఉంటుంది. కోర్టు వ్యవహారములు కలిసివచ్చును. తరువాత సంవత్సరాంతం వరకూ గురుడు బలహీనుడై ద్వాదశస్థాన సంచారము వలన అన్ని విధములా కష్టదాయకంగా ఉంటుంది. జనఘోష అధికము అవుతుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగ వ్యవహారములు

చేయువారు ముఖ్యముగా రాజకీయనాయకులకు అధికారవర్గముతోను పైవారితోను అనేకమైన చికాకులు, కలహములు, నిందలు, స్థలదోషమున్నదని వాస్తుమార్పులు చేయుట, ఇష్టములేని పనులు తప్పక చేయవలచిన పరిస్థితి, నూతన వ్యక్తులు పరిచయాలు తలపోటుగా మారుట. మత్తు పానీయాలు, దుర్వ్యసనాలకు లోనుఅగుట శని జూన్ 20 వరకూ ధనూరాశియందు మరల వక్రగతిపొంది అక్టోబరు 26 వరకూ జన్మరాశి వృశ్చికరాశి యందు సంచారము మరలా సంవత్సరాంతం వరకూ ధనూరాశి సంచారం శనివల్ల ఏలినాటి శనిప్రభావం కలిగి ఉన్నందున ఆకస్మిక అనారోగ్యములు, శస్త్రచికిత్సలు, ఇంటా బయటా ప్రశాంత వాతావరణము లేకపోవుట, జాయింట్‌దారులతో కలహములు, మోసగించబడుట, క్రిందవారితోను మాటపడుట వ్యవసాయదారులకు కీటకభయం లేక పంటసరిగా పండకుండుట. జ్ఞాపకశక్తి మందగించుట, పుణ్యక్షేత్ర దర్శనాలు చేయుసమయమున అనారోగ్యములు, శస్త్రచికిత్సలు, రాహువు, కేతువులు అంతంతమాత్రమే. కేతువు ఆగష్టు 17 వరకు అర్థాష్టమ కేతువు దోషప్రదుడు. రాహువు ఆగష్టు 17 వరకు రాజ్య రాహువు అనంతరం అంత ఉపయోగముగా ఉండును. మొత్తముగా ఈ సం॥రం ఈ జాతకులకు అంతంత మాత్రమే. ఖర్చులు అధికము, మనస్సు ఆందోళనగా యుంటుంది. మనోనిబ్బరము. దైవధ్యాస అత్యంత అవసరము. చెప్పుడుమాటలు వినక మౌనము వహించుట ఉత్తమోత్తమము.

**దోష పరిహారం :** ఈ రాశివారు శని, గురు, కేతువులను శాంతి జరిపించి శనివారం గురువారం నియమాలు పాటించాలి. గురునికి సెప్టెంబరు 12 తరువాత 16 వేలు జపం, తర్పణం హోమం $1^1/_4$ కేజీ శనగలు దానం, ఈశ్వర అభిషేకం జరిపించాలి. శనికి జూన్ 20 తరువాత 19 వేలు జపం, తర్పణం హోమం, తిలదానం జరిపించాలి. శనిత్రయోదశి రోజున శనికి తైలాభిషేకం జరిపించాలి. ఆంజనేయస్వామి వారికి శనివారం మన్యుసూక్త పారాయణతో అభిషేకం, తమలపాకులతో సహస్ర నామ అర్చన జరిపించాలి. **శనివారం** 19 మందికి అన్నశాంతి జరిపించాలి. శనిరక్ష ధరించాలి. రావిచెట్టు ప్రదక్షిణం చేయుట, నీరుపోయుట శుభప్రదము.

**ఏప్రియల్ :** ఇబ్బందికరమైన మాటలు వినుట ఋణములు చేయుట, వేళదాటిన తర్వాత భోజనము, బంధువులను పరామర్శించుట, సంఘమున గౌరవం, ఇంటా బయాటా ఇబ్బంది. ఆడంబరాలకు పోయి ధనవ్యయం, తరచూ ప్రయాణ వాంఛ.

**మే :** ఆరోగ్యలాభం, భూ సంబంధమైన విషయముల యందు విరోధాలు వైద్యులతో పరిచయాలు, ప్రమాణ ఆటంకాలు భార్య తరపు వారితో విరోధాలు, వ్యనసములు కొరకై అధిక ధనవ్యయము, ఆర్థిక ఇబ్బందులు.

**జూన్ :** శుభకార్యాలు నిమిత్తమై సమయము వెచ్చించుట పాత బాకీలు వసూలు అగుట, ఆర్థిక ఇబ్బందులు, తొలగుట, గాయములు, నూతన ప్రయత్నములు కలసి వచ్చుట రాజకీయనాయకులకు గడ్డుకాలము.

**జూలై :** పట్టుదల అధికము, అధికార లాభము, తరచు నోరుకి సంబంధిత అనారోగ్యము ప్రతీకార్యము నందు తొందరపాటు నిర్ణయాలు, అధికశ్రమతో ధనార్జన స్త్రీమూలక అపవాదులు ప్రమాణములు యందు జాగ్రత్త అవసరము.

**ఆగస్టు :** చిన్న చిన్న ఆటంకాలు, భూ, గృహ, వాహనాభివృద్ధి, ఋణములు చేయుదురు. అనుకొన్న సమయానికి ఏదో విధముగా ధనము చేతికి అందుట పెండింగ్‌లో ఉన్న పనులు పూర్తి అగుట, పట్టుదలకు వెళ్ళి ఇబ్బందులు తెచ్చుకొనుట విహార యాత్రలు, సోదర విరోధం.

**సెప్టెంబర్ :** బంధు వర్గము మరియు అందరితో విరోధాలు, నరఘోష అధికము ప్రతీ చిన్న పని ఆలస్యమగుట, పుణ్యతీర్థక్షేత్ర దర్శనములు, చేయువృత్తి వ్యాపార వ్యవహారములు యందు స్వల్ప విరోధాలు స్త్రీలతో గొడవలు కుటుంబ సమస్యలు.

**అక్టోబర్ :** మనస్సున ఆనందము అసత్యములు పల్కుట, అనుకొన్న పనులు యందు విజయము సాధించుట, విందు వినోదాల యందు పాల్గొనుట నూతన వాహన లాభము, స్థిరాస్థి వృద్ధి, దైవకార్యములు యందు పాల్గొనుట ప్రమోషన్‌లు, అధికారుల యొక్క ఆదరణ.

**నవంబర్ :** ధనాదాయం వృద్ధి పై అధికారుల ఆగ్రహానికి గురియగుట నరఘోష అధికము, ఇంటియందు సంతాన లాభము శతృశేషము అధికమగుట చేయు వ్యాపారములందు జయము, ఉద్యోగస్తులకు వేరేచోటికి బదిలీలు కుటుంబసౌఖ్యం శ్రమ అధికం.

**డిశెంబర్ :** విలాస వస్తువుల సమకూర్చుట, భార్యభర్తల మధ్య స్వల్ప విరోధాలు నూతన ఆభరణములు కొనుట, వివాహము కాని వారికి అనుకూలమయిన సంబంధము కుదురుట. ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించాలి. ఉద్యోగ ప్రయత్నములు, విదేశప్రయత్నములు కలసి వచ్చును.

**2018 జనవరి :** ఓర్పు, శాంతములతో ఆచితూచి మాటలాడుట మంచిది ఇతరుల విషయాలలో జోక్యము చేసుకొనుట మంచిది కాదు. జామీను సంతకాలు పెట్టుట, మధ్యవర్తిగా యుండుట వలన ఇబ్బందులు, భూ, గృహమార్పులు, ఋణబాధ మనశ్శాంతి లోపించుట తలకు సంబంధించిన అనారోగ్యం.

**ఫిబ్రవరి :** వాహన సౌఖ్యము, ఇంటియందు శుభకార్యములు, సంతాన యోగము స్థలమార్పులు, చర్మసంబంధిత అనారోగ్యములు, గుండెదడ, భయము పనుల ఒత్తిడి ఎక్కువ పరస్త్రీ వ్యామోహం, వైద్యరీత్యా ధనవ్యయం అనుకోని కలహములు.

**మార్చి :** ఉదర సంబంధిత అనారోగ్యములు ఋణములు చేయుట, గృహము నందు శుభకార్యాలు పాతమిత్రులు దూరమగుట, బంధువులతో విందు వినోదాల యందు పాల్గొనుట అధిక ధనవ్యయం అకారణ కులహములు, వ్యసనముల యందు ఆసక్తి, ధర్మకార్యములు యందు నిర్లక్ష్యం మనఃచాంచల్యం.



# ధనూరాశి

మూల 1, 2, 3, 4 పా॥
పూర్వాభాద్ర 1, 2, 3, 4 పా॥
ఉత్తరాషాఢ 1 పా॥

**ఆదాయం : 11, వ్యయం : 5, రాజపూజ్యం : 7, అవమానం : 5**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 3**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

మూల నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 7, అదృష్ట రత్నం వైఢూర్యం
పూర్వాషాఢ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 6, అదృష్ట రత్నం వజ్రము
ఉత్తరాషాఢ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 1, అదృష్ట రత్నం కెంపు.
మూల నక్షత్ర స్త్రీలు వైఢూర్యం ఎడమచేయి చిటికెన వ్రేలునకు, పురుషులు కుడిచేయి చిటికెన వ్రేలునకు, పూర్వాషాఢ నక్షత్ర స్త్రీ, పురుషులు వజ్రము కుడిచేయి చూపుడు వ్రులేఉనకు, ఉత్తరాషాఢ నక్షత్ర స్త్రీ, పురుషులు కెంపు కుడిచేయి ఉ ఒగరపు వ్రేలునకు ధరించాలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉ ఒగరములు శుభసమయమున ధరించుటశుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు దశమ స్థానమున కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు ఏకాదశ స్థానమున తులారాశి యందు సంచరించును. శని జూన్ 20 వరకు జన్మరాశి ధనూరాశి యందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది ద్వాదశ స్థానమున వృశ్చిక రాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు జన్మరాశి ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు భాగ్య స్థానమున సింహరాశి యందు కేతువు తృతీయ స్థానమున కుంభరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు అష్టమ స్థానమున కర్కాటక రాశియందు కేతువు ద్వితీయ స్థానమున కర్కాటక రాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు సెప్టెంబరు 12వరకూ దశమరాశి కన్యారాశియందు సంచరించును. ఏ పని తలపెట్టినా, చేసినా కలసిరాకుండుట, ధనము. అనవసరపు ఖర్చులకు గురి అగుట, అనవసరపు ప్రయాణాలు అధికము. సొంత మనుష్యులు, యిబ్బందిపెట్టుట. శ్రమ అధికము ఫలితము శూన్యము, గౌరవభంగపాటు, గృహనిర్మాణములు కలిసి రాకుండుట. సంతానమూలక సమస్యలు జాయింట్ వ్యవహారములుయందు అవకతవకలు, ప్రతీరోజు ఔషధసేవ ఆరోగ్యం కుదురుపడక యిబ్బందిపడుట. కుటుంబ, ధన, వివాహ సమస్య గూర్చి యిబ్బంది అధికమగుట, విదేశీ ప్రయాణాలు కలిసిరావు. సంవత్సరాంతం వరకు గురుడు ఏకాదశ స్థాన తులారాశి సంచారము

వలన వ్యాపార, వ్యవహారములుయందు అనుకూల వాతావరణం, శుభకార్యాలు కలిసివస్తాయి. దగ్గరివారితో చుట్టరికం కలుపుకుంటారు. బంధువర్గమువారితో సత్సంబంధాలు గౌరవం, రావలసిన మొండిబాకీలు అర్ధభాగం వసూలు అగుట. ఆదాయం ఖర్చు సమానమగుట. భార్య తరపువారికి అనారోగ్యములు లేక సూతకములు. కాంట్రాక్టుదారులకు బాగా కలిసివచ్చును. శని జూన్ 20 వరకు జన్మరాశి ధనూరాశి సంచారము వలన గుండెకు సంబంధిత లేక ఉదర సంబంధిత అనారోగ్యములు. ధనము అనారోగ్యరీత్యా వ్యయమగుట. ప్రతీ పనీ ఆలస్యమగుట లేక పదిసార్లు తిరుగాడు పరిస్థితిగా ఉండును. తేజస్సు తగ్గుట, జ్ఞాపకశక్తి తగ్గుట బంధువులతో ముఖ్యముగా విరోధములకు కారణము మీరే అగుట వలన బాధపడుట, అక్టోబరు 26 వరకు వక్రగతి సంచారము వలన ద్వాదశ స్థాన వృశ్చికరాశి సంచార మరల సంవత్సరాంతంవరకూ ధనూరాశి సంచారము ఈ సం॥రం శని దోషం అధికముగానే యున్నది. రాహువు ఆగష్టు 17 నుండి అష్టమ రాహుదోషప్రదుడు. తలకుమించిన బరువు మోయవలసిన పరిస్థితి, మాటయిచ్చి బాధపడుట. జీవితమే విరక్తిభావముతో ఉండి దూర ప్రాంతములకు వెళ్ళి రావాలా ? అనే పరిస్థితి స్త్రీలతో కూడా విరోధము. కేతువు ద్వితీయమున మకరరాశి యందు సంచారము కొంతవరకు మెరుగు. స్నేహితులు, బంధువులు, గురువులు రూపములో కొంతధైర్యము చెప్పుటవలన మనశ్శాంతి కలుగును. వేళ దాటిన భోజనములు, సంతానమునకు అనారోగ్యము, కోర్టు తగాదాలు, శస్త్ర చికిత్సలు, మిమ్ములను ఇతరులు దూషించుట మోకాళ్ళు నొప్పులు, జీర్ణకోశ సంభంధిత అనారోగ్యములు, గ్యాస్ ట్రబుల్స్, వ్యవసాయదారులకు పంటలు కలసి రాక పోవుట, ఋణములు పెరుగుట ఆదాయమునకు మించి రెట్టింపు ఖర్చు జరుగుట వ్యసనము పెరుగుట, గృహ వాస్తు, మార్పులు చేయుట, వృత్తియందు కలహములు, వ్యాపారములు కలసిరాకపోవుట, మీ తప్పులు లేకనే మాటలు పడుట తండ్రితో మాట పట్టింపు, భయము, భార్యతో అవమాన పడుట. ప్రతీ పని వాయిదా పడుట వైద్యరంగములో ఉన్న వారికి అవమానములు.

**దోష పరిహారం (శాంతి) :** ఈ రాశివారికి శని, రాహువులు దోషప్రదులు గృహమున శనివారం 11వారములు మహాలింగార్చన జరిపించి నియమాలు పాటించాలి. 11 రోజులు దుర్గాదేవికి సహస్రకుంకుమార్చన జరిపించాలి. శనిత్రయోదశి పర్వదినాన మందపల్లె శనీశ్వరాలయం వద్ద తైలాభిషేకం జరిపించి, తిలదానం మరియు $1^1/_4$ కేజీ మినుములు దానం చేయాలి. శనిని 19 వేలు, రాహువుకి 18 వేలు జపం, తర్పణం, హోమం జరిపించాలి. శ్రీశైలం క్షేత్రమున చండీహోమం 3 రోజులు జరిపించాలి.

**ఏప్రియల్ :** నూతన పరిచయాలు అనుకూలించుట, కోర్టు చిక్కులు విడిపోవుట ఉద్యోగ అవకాశాలు, సఫలీకృతమగుట, మీ మాటకు గౌరవం, పెద్దవారి పరిచయాలు దైవదర్శనములు, పాతమిత్రుల కలయిక, తోబుట్టువులతో భూమి తగాదాలు గృహనిర్మాణ పనులు చేయుదురు.

**మే :** ఈ నెల శుభాశుభ మిశ్రమముగా ఉండును. గృహమార్పులు ప్రయత్నించిన పనులు పూర్తియగుట. నూతన వస్తు వస్త్రములు కొనుట, అధికారుల ఒత్తిడి పెరుగుట, ఋణములు అతికష్టంమీద తీరుట.

**జూన్ :** వ్యాపారం నందు స్వల్పలాభములు వంశ అభివృద్ధి స్త్రీ సహాయము ప్రయత్నించిన కార్యములు నెరవేరుట దైవకార్యములు యందు పాల్గొనుట, తీర్థ యాత్రలు చేయుట, వాహన యోగము, వ్యవసాయంలో ధనలాభము పెద్దవారి స్నేహములు, నూతన స్త్రీ పరిచయాలు.

**జూలై :** ఇంటియందు శుభకార్యములు, అనుకోని ప్రయాణములు, పుణ్యక్షేత్ర దర్శనములు ప్రతి పని యందు ఆశించిన ఫలితములు లేకుండుట విసుగుదల అధికము, దూరప్రాంతం నుండి బంధువులు వచ్చుట, ధనవ్యయం.

**ఆగష్టు :** ఇంటియందు అనారోగ్యములు, తరచూ వైద్యుని సంప్రదించుట మధ్యవర్తిగా ఉన్న పనులయందు ఇబ్బందులు, కోర్టు తగాదాలు, చెడుకలలు మీరు నమ్మిన వారివల్ల ఇబ్బందులు, మనస్సున ఆందోళన, భార్యతో కలహములు, వ్యాపారంనందు స్వల్పలాభములు.

**సెప్టెంబర్ :** వివాహాది శుభకార్యములు కొరకై ఆలోచనలు, శుభకార్యముకు ధన వ్యయం జాయింటు దారులతో ఇబ్బందులు, రాజకీయ నాయకులతో పరిచయములు, పాతమిత్రులు కలయిక సంతోషాన్నిచ్చును. అవసరానికి ఏదో విధంగా ధనం చేతికి అందును, అనుకున్న పనులు నెరవేరును.

**అక్టోబర్ :** ప్రతి పని యందు ఆటంకములు, ఆరోగ్య విషయమందు జాగ్రత్త అవసరము, రాజకీయ వ్యవహారములందు అనవసరపు ప్రయాణములు, కోర్టు తగాదాలు, మనస్సు నికరం లేకుండుట, ఆకర్షణ తగ్గుట, కీర్తి భంగపాటు, కుటుంబ సభ్యులతో కలహాలు, పెట్టుబడులు రాణించవు.

**నవంబర్ :** వివాహ ప్రయత్నములు ఫలించుట, గృహ మార్పులు చేయుట, మిత్రుల సలహా సహకారాలు అందుతాయి, రాజకీయ ప్రాముఖ్యత పెరిగి అధికార లాభములు, కోర్టులు విజయం సాధించగలరు, అలంకార వస్తువులు కొనుట, గృహ నిర్మాణాదులు, పాలబాకీలు వసూలు అగుట.

**డిశెంబర్ :** చెడు తలంపులు, చెడు స్నేహములు చేయుట, శత్రువులతో వాదములు, ప్రయాణాలరీత్యా ధనవ్యయం, చెడువార్తలు వినుట, పాపకర్మలయందు ఇష్టత, విపరీత కోపము, స్వల్ప అనారోగ్యము, ఇంటా బయటా విరోధాలు, నూతన వస్త్రములు కొనుట, వ్యాపారకార్యభంగములు.

**2018 జనవరి :** మాట్లాడితే విరోధాలు, మనస్సున భయం, అధికారుల ఒత్తిడి స్నేహితుల వల్ల మోసపోవుట, వృత్తియందు స్వల్పలాభములు, తొందరపాటు స్వభావం వల్ల ఇబ్బందులు, వ్యాపారమందు స్వల్ప మార్పులు చేయుదురు. వృత్తిరీత్య అధికారులవల్ల ఒత్తిడి, ఋణములు అతికష్టం మీద తీరును.

**ఫిబ్రవరి :** ఏదో విధంగా ధనము చేతికి అందును, శత్రువులతో వాదాలు, ఉ ద్యోగం నందు అవకతవకలు. వాహన లాభములు తీర్థాయాత్రలు చేయుట డాంభికము అధిక మగుట , స్వల్ప ప్రజా వ్యతిరేకత, ఫైనాన్స్ వ్యాపారస్తులకు పాల బాకీలు వసూలు అగుట, ఇంటియందు శుభకార్యములు.

**మార్చి :** వ్యర్థప్రయత్నాలు, మానసిక అశాంతి, శరీరమునందు బాధ, అనారోగ్యము, అజీర్ణవ్యాధి, శత్రువులతో భయము, అకాలభోజనము ఆధ్యాత్మిక చింతన తగ్గుట, అందరిచే మాటలు పడుట, పనిచేయు చోట్ల మనకంటే పెద్దవారితో మాటా మాటా పట్టింపులు, చేయు వ్యాపారంనందు చికాకులు.



# మకరరాశి

ఉత్తరాషాఢ 2, 3, 4 పా॥
శ్రవణం 1, 2, 3, 4 పా॥
ధనిష్ఠ 1, 2 పా॥

**ఆదాయం : 14, వ్యయం : 14, రాజపూజ్యం : 3, అవమానం : 1**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 8**

## అదృష్ట సంఖ్యలు-రత్నములు

ఉత్తరాషాఢ నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 1, అదృష్ట రత్నం కెంపు
శ్రవణా నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 2, అదృష్ట రత్నం ముత్యము
ధనిష్ఠ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడం.

ఉత్తరాషాఢ నక్షత్ర స్త్రీ పురుషులు కెంపు కుడిచేయి ఉంగరపు వ్రేలునకు, శ్రణా నక్షత్ర స్త్రీ, పురుషులుముత్యముక ఉడిచేయి ఉంగరపు వ్రేలునకు, ధనిష్ఠ నక్షత్ర స్త్రీ, పురుషులు పగడం కుడిచేయి ఉంగరపు వ్రేలునకు ధరించాలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట శుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు భాగ్య స్థానమున కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు రాజ్య స్థానమున తులారాశి యందు సంచరించును. శని జూన్ 20 వరకు ద్వాదశ స్థానమున ధనూరాశియందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది ఏకాదశ స్థానమున వృశ్చిక రాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు ద్వాదశ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు అష్టమ స్థానమున సింహరాశి యందు కేతువు ద్వితీయ స్థానమున కుంభరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు సప్తమ స్థానమున కర్కాటక రాశియందు కేతువు జన్మరాశి మకర రాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు సెప్టెంబరు 12వరకూ నవమస్థానమున కన్యారాశియందు సంచరించును. ప్రారంభమున అన్నిరంగములవారికి యోగవంతముగానే యుంటుంది. ధన, గౌరవాదులు, స్థిరాస్థి వృద్ధిచేయు ప్రయత్నాలు కలిసివచ్చును. సోదర సోదరీల వర్గ మధ్య ఉన్న ఆర్థిక స్థిరాస్థి లావాదేవీలు విజయవంతమగును. గృహమున వివాహాది శుభకార్యాలు, నూతనగృహ నిర్మాణాలు కలసివచ్చును. పాత మొండిబకాయిలు వచ్చును. తీర్థయాత్రలు, విహారయాత్రలు చేయుట ఆనందము. దైవ సంబంధిత కార్యములయందు పాల్గొని ప్రధానపాత్ర వహించెదరు. విదేశీ ప్రయాణాలు కలిసివచ్చును. విద్యార్థులకు మంచికాలము. వ్యాపారస్తులకు

అధికారులు ద్వారా కానీ బ్యాంక్‌లు ద్వారా యోగవంతముగా కలిసివచ్చును. తరువాత సంవత్సరాంతం వరకూ గురుడు దశమరాశి తులారాశి సంచారము వలన ప్రతీ పనీ ఆచితూచిమాటలు, చేతలు, వాగ్దానాలు చేయుట మంచిది లేనిచో యింటివారితోను, బయటవారితోను విరోధాలు ముంచుకొస్తాయి. క్రింద పనిచేయువారికి ఏ గుట్టు చెప్పకపోవుట శుభదాయకము లేనిచో అనర్థదాయకము నిందపోగొట్టుకొనలేరు. రాత్రి యందు తిరుగాడు స్వభావము తగ్గించుకొనుట మంచిది, లేనిచో వాగ్దానము చేసి మాట తిప్పుకోలేక చాలా యిబ్బందిపడుదురు. రాజకీయ వ్యవహారములకు దూరముగా ఉండుట మంచిది. శని జూన్ 20 వరకు ధనూరాశి ద్వాదశ రాశి సంచారము. ఏలినాటి శని ప్రారంభసమయము మీ మీద మీకు మరియు ఇతరులకు విశ్వాసము తగ్గే అవకాశములు, కావున ప్రతీ పని పెద్దవారి ఆశీస్సులు తీసుకొని సలహామేరకు నడవడికను మార్చుకోవాలి. ఆరోగ్య విషయమున జాగ్రత్త అవసరము. చిరుతిండ్లు, వ్యసనములకు దూరముగా ఉండుట మంచిది. రాహువు ఆగష్టు 17 వరకు అష్ఠమరాశి సంచారము మంచిది కాదు. కీర్తి భంగపాటు లేక శరీర అనారోగ్యములు, జంతు, భయము ఆగష్టు 17 నుండి కేతువు జన్మరాశి మకరరాశి సంచారము వలన భార్యాబిడ్డలతో విరోధములు, దేశసంచారములు, అనారోగ్యములు, ధననష్టములు. మానసిక ఆందోళన, చెప్పుడు మాటలువిని ఆచరించి కష్టములు పాలగుట.

**దోష పరిహార శాంతి :** ఈ రాశివారికి సెప్టెంబరు 12 తరువాత గురుడు దోషప్రభావం కావున 11 గురువారములు రుద్రాభిషేకం జరిపించాలి. శనికి - 19 వేలు జపం, మృత్యుంజయునికి 11 వేలు జపం తర్పణం, హోమం, అన్నశాంతి జరిపించాలి. శనికి తైలాభిషేకం జరిపించాలి. తిలదానం యివ్వాలి. ఆగస్టు 17వ తేదీ లోపుగా దుర్గాదేవికి సహస్రకుంకుమార్చన 7 వారములు జరిపించి గృహమున **'లలితా సహస్రనామ పారాయణ'** దుర్గాసప్తశతీ పారాయణ జరిపించి చండీహోమము జరిపించుట సకల శ్రేయోదాయకం. భువనేశ్వరి యంత్రం, నరఘోషయంత్రం గృహమున స్థాపించాలి.

**ఏప్రియల్ :** గృహ నిర్మాణాదులకు ఆటంకములు, ఆదాయం తగ్గుట, సోదర మైత్రి ఏర్పడుట, వినోదములు, వస్త్రులాభములు, భూమికొనుట, బంధువుల, సోదరుల సహాయం మీకు లభించును. చికాకులు, సమస్యలు, ఆటంకములు, ప్రయాణాల్లో ప్రమాదసూచన.

**మే :** కుటుంబ సౌఖ్యము, ధనలాభం, సంతోషము, ఆరోగ్యము చక్కబడుట బంధువులను కలుసుకొనుట, ప్రయాణములలో చోరభయము మనఃశ్శాంతి లేకుండుట, భార్య పిల్లలకు రోగములు, విరోధములు, చివరకు పనులు పూర్తి చేసెదరు.

**జూన్ :** ప్రతి విషయంలో జాగ్రత్త అవసరము, మానసిక క్షోభ, భయము విక్రయము చేయుట, అవమానం వ్యాపారం నష్టములు ప్రమోషన్లు నిలిచి యుండును. కుటుంబ ఎడబాటు, పండితులు ఆగ్రహమునకు గురి అగుట, కొంత వరకు అనుకూలం ప్రయాణములు చేయుట, నూతన కార్యములు ఆచరించుట.

**జూలై :** గృహమార్పులు, ప్రయత్నించిన కార్యములు కష్టము మీద పూర్తి అగును. దూర దృష్టి ఎక్కువగా ఉండును. వ్యాపార లావాదేవిలు కలసి వచ్చును. మీకు రావలసిన బాకీలు వచ్చును. మనస్సులో అనుకొన్న పనులు పూర్తి, కోర్టు వాయిదాలు నిలిచియుండును. మాసం చివరలో వస్త్రప్రాప్తి వాహన సుఖం.

**ఆగష్టు :** మీ ఇంటి యందు పుత్రోత్సవము, గృహములో ఆనందం, లాభములు భార్య సుఖము తక్కువ పంటలు కలసి వచ్చును. ఉద్రేకత ఎక్కువ అకారణ విరోధములు, శతృత్వములు, రోగభయము, అలంకార ప్రాప్తి ఆకస్మిక ధనలాభం, భయాందోళన ఆదాయం మించిన ఖర్చులు.

**సెప్టెంబర్ :** ఆర్థికంగా కలసివచ్చును, కుటుంబ చిక్కులు, బంధు మిత్రులతో విందు వినోదములు, వ్యవసాయంలో నష్టం కల్గును. నూతన ప్రయత్నములకు ఆశాభంగం, కలహములు, ప్రయత్న కార్యసిద్ధి, సుఖము, సంతోషము నూతన వస్తువులు, వస్త్రములు కొనుట, అధికార ఒత్తిడి.

**అక్టోబర్ :** ఆదాయం తగ్గును, దైవకార్యములలో పాల్గొందురు. ఆరోగ్యంలోపం భార్య పిల్లలు వల్ల ఇబ్బంది. కుటుంబ ఖర్చులు ఎక్కువ దెబ్బలు తగులట అపజయం, మనోవిచారం, దూర బంధువుల మరణవార్త వినుట వృత్తి యందు ఆటంకములు, మిత్రులను కలుసుకొనుట, కుటుంబ విరోధములు.

**నవంబర్ :** భార్య పిల్లలతో ప్రయాణములు చేయుదురు. నూతన వస్త్ర లాభములు, ధనము విపరీతముగా ఖర్చుచేయదురు. ఆలోచనలు ఎక్కువ గొడవలు తీరనిలోటు, అపజయం, తీర్థయాత్రలు చేయుట.

**డిశెంబర్ :** కొత్త వస్తువులు కొనుట అనుకున్న పనులు సాధించలేరు, ఋణములు చేయుదురు ఏ పనియు కలసిరాదు. అపకీర్తి, వ్యాపారము గూర్చి ఆలోచనలు మిత్రులు సహకరించెదురు. వృత్తి ఉద్యోగాదులలో సామాన్యం.

**జనవరి :** గృహ నిర్మాణప్రయాత్నములు ఫలించును. కొత్తవారి పరిచయములు ఆదాయం బాగానే ఉండును, ప్రయాణములు చేయుదురు, ఇంటా బయటా గౌరవం. కీర్తివృద్ధి అగును, ఉత్సాహ భరితులై యుందురు. మీ కుమారుడు ఉద్యోగ ప్రయాత్నాలు కలసివచ్చును శుభకార్యములు చేయుదురు.

**ఫిబ్రవరి :** చేయువృత్తి యందు అభివృద్ధి నూతన పరిచయము కాంట్రాక్టులు కలసివచ్చును, అంతా అనుకూలం, పనియందు శ్రద్ధ, మిల్లర్లుకు మందంగా నడుచును, చోరభయం, వాహనప్రమాదములు, పెద్ద పెద్ద చిక్కులు మీ మాటకు విలువ ఉండదు, రాజీలు చేయుదురు.

**మార్చి :** కోర్టు వ్యవహారం చిక్కులు ఆర్థిక ఇబ్బంది. మీకు కావలసిన వారు మోసము చేయుదురు, ఆలోచనలు పెద్దవారితో పరిచయములు ఉద్యోగ అనుకూలత, జయం, వ్యాపార వ్యవహారములు యందు అనుకూలం మంచి ధైర్యము గృహ మార్పులు చేయుదురు, శుభకార్యములు ద్వారా ధన వ్యయం.



# కుంభరాశి

ధనిష్ఠ 3, 4 పా॥
శతభిషం 1, 2, 3, 4 పా॥
పూర్వాభాద్ర 1, 2, 3 పా॥

**ఆదాయం : 14, వ్యయం : 14, రాజపూజ్యం : 6, అవమానం : 1**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 8**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

ధనిష్ఠ నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడము
శతభిషం నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 4, అదృష్ట రత్నం గోమేధికము
పూర్వాభాద్ర నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం

ధనిష్ఠా నక్షత్ర స్త్రీ పురుషులు పగడము కుడిచేయి ఉంగరపు వ్రేలునకు, శతభిషా నక్షత్ర స్త్రీ గోమేధికము ఎడమ చేయి మధ్య వ్రేలునకు, పురుషులు కుడిచేయి మధ్య వ్రేలునకు, పూర్వాభాద్ర నక్షత్ర స్త్రీ, పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు ధరించాలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట శుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు అష్టమ స్థానమున కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు భాగ్య స్థానమున తులారాశి యందు సంచరించును. శని జూన్ 20 వరకు ఏకాదశ స్థానమున ధనూరాశియందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది దశమ స్థానమున వృశ్చిక రాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు ఏకాదశ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు సప్తమ స్థానమున సింహరాశి యందు కేతువు జన్మించిన కుంభరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు షష్ఠమ స్థానమున కర్కాటక రాశియందు కేతువు ద్వాదశ స్థానమున మకర రాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు సెప్టెంబరు 12 వరకూ అష్టమరాశి కన్యారాశియందు సంచరించును. ప్రారంభ కాలమున ఏదో తెలియని భయమునకు గురి అగుట. హార్ట్‌బీట్ పెరుగుట వలన ఏదో అనారోగ్యము అనే భయము కలిగియుండును. తేజస్సు తగ్గుట, నిద్రపట్టకుండుట, తరచూ అధికారులతో కాని పెద్దవారితోను మాటలుపడుట, అందరూ మన ఎదురుగా మనమాట వెళ్ళిన తరువాత అవహేళనగా అందరికీ చెప్పుట, కోపము ఆధిక్యత పెరుగుట. ప్రతి పని మొండిపట్టుదలతో, తెగింపుతో చేసి యిబ్బందిపడుట. క్రూరమగు మాటలు పడుట. యితరులను యిబ్బందిపెట్టుట. మరలా బాధపడుట యిదే నిత్యకృత్యమా అనునట్లుగా ఉండును. శత్రువులు కూడా మిత్రులుగా మారుట. యింటియందు ఆగివున్న శుభకార్యాలు కలసి వచ్చుట.

శని జూన్ 20 వరకూ ఏకాదశ స్థాన సంచారము వలన పట్టిందల్లా బంగారమే అనునట్లుగా ఉంటుంది. ప్రతీ పనియందు మౌనము వహించుట సకల శుభములు. సుఖము కలుగును. పిల్లలకు భవిష్యత్తు ఏర్పడి ఆనందకరముగా ఉంటుంది. బిడ్డలకు యింటా బయటా గౌరవమర్యాదలు అక్టోబరు 26 వరకూ శని వృశ్చికరాశి సంచారము కొంచెం యిబ్బందిగా ఉన్ననూ తరువాత సంవత్సరాంతం శని యోగవంతముగా ఉండును. రాహువు ఆగష్టు 17 నుండి కర్కాటక రాశి సంచారము వలన శత్రువులు కూడా మిత్రులుగా మారుట, నెమ్మది నెమ్మదిగా కార్యములు సిద్ధించుట యోగవంతముగానే ఉంటుంది. కేతువు ఈ సం॥రం అంతయు జన్మరాశి ద్వాదశ రాశుల యందు సంచారము మాత్రం అవయోగం. దుఃఖము కలగజేయును. కొన్ని సందర్భాలలో తొందరపాటు నిర్ణయాలు మిమ్ములను చాలా అవహేళన చేయువారు దగ్గరవారే అగుటవలన చాలా బాధపడి సిగ్గుపడుదురు. స్త్రీలు లేక బయట వారువెవరి మాటైనా మీ పిల్లలతో ఆలోచించి చేయుట శ్రేయోదాయకం. కిరాణ, ఫైనాన్స్, జ్యూయలరీ, కాంట్రాక్టర్స్, R.T.C. ప్రైవేటు రంగం ఉద్యోగులు, వాహనములు తయారు కంపెనీలకు. ఈ సం॥రం ధనాదాయం గౌరవ మర్యాదలు, కుటుంబ సహాయ సహకారములు కంపెనీలకు ఈ సం॥రం ధనాదాయం గౌరవ మర్యాదలు, కుటుంబ సహాయ సహకారము తక్కువ ప్రమోషన్లు వాయిదా పడుట. పుణ్యక్షేత్ర సందర్శనాలు నమ్మిన వారి వల్ల మోసములు, దగాలు ఇంజనీరింగు, టెక్నికల్, చేతి వృత్తుల వారికి మధ్యమ ప్రదాయకము. క్లిష్టమైన సమస్యలు పరిష్కారం, తలకు మించిన బరువులు, జీవితము నందు విరక్తి , రక్తబంధు అరిష్టం.

**దోష పరిహారం-శాంతి :** ఈ రాశి వారికి కేతువు, గురుడు అత్యంత దోషప్రదులు, కావున పెద్దవారిని సేవించుట ప్రతీపని పెద్దవారిని (తల్లి, తండ్రి) తో చెప్పి కార్యక్రమము ప్రారంభించుట వారి ఆశీస్సులే మీకు శ్రీరామరక్ష. ఆగష్టు 17లోపుగా పంచాక్షరీ సంపుటి గురుగ్రహ జపం 16 వేలు, దుర్గాసూక్త సంపుటిత కేతుగ్రహజపం 21వేలు జరిపించాలి. తర్పణ, హోమం, ఈశ్వర అభిషేకం $1^1/_4$ కేజీ శనగలు, $1^1/_4$ కేజీ ఉలవలు దానం, అన్నశాంతి జరిపించాలి. ప్రతి మంగళవారం (11 వారములు) అమ్మవారిని పూజించి నియమం పాటించాలి. ఏకభుక్తం చేసి అమ్మవారిని ఉదయం, సాయంత్రం పూజించి పులిహోర నివేదనపెట్టి పంచండి. అమ్మవారి ఆశీస్సులతో సకలశుభములు కలుగును. **"శ్రీయంత్రరక్ష"** ధరించుట వలన కుటుంబసౌఖ్యం కలుగును.

**ఏప్రియల్ :** వంశవృద్ధి, మీ మాటకు ఎదురులేకుండుట, చేతి వృత్తులవారికి మంచి యోగదాయకముగా ఉండును. శ్రమకు తగిన ఫలితము లభించును. పెండింగ్‌లో ఉన్న పనులు త్వరితముగా నెరవేరుట, ఇంటయందు వాస్తు మార్పులు చేయుదురు. నూతన నిర్మాణాదులు కలసివచ్చును.

**మే :** జంతు మూలన భయము, పరస్త్రీ వలన అవమానములు, మొదలు పెట్టిన పనులు కలసి రాక పోవుట, వ్యవహారములయందు చిక్కులు రాజకీయ నాయకులు ఒత్తిడి పెరుగును. పై ఉన్న అధికారుల వల్ల స్వల్ప లాభములు, అనుకొన్న చోట్లకు బదిలీలు, ఉన్న సమస్యలన్నీ సజావుగా నెరవేరుట సంతాన సౌఖ్యం.

**జూన్ :** ఈ మాసము శుభాశుభ మిశ్రమము, ఆదాయం పెరుగును ఇష్టము సిద్ధించును. మనక్రింద పనిచేయు వారివల్ల లాభములు, ఆకస్మిక కలహములు, పాతబాకీలు అతికష్టంమీద వసూలు అగును. ఆరోగ్యంనందు, శ్రద్ధ వహించవలెను.

**జూలై :** బంధువర్గం వారిలో విరోధములు, ఊహకు అందని ఖర్చులు అనారోగ్యం కల్గి అలసట సంభవించును. భయాందోళనలు, ఉష్ణ సంబందిత అనారోగ్యము తేజస్సు తగ్గును. స్త్రీ మూలన ఇబ్బందులు, శ్రమకు తగిన ఫలితము లేకుండుట, కోపము యొక్క ఆధిక్యత పెరిగి ఉండుట.

**ఆగష్టు :** కీర్తి ప్రతిష్ఠలు, వృద్ధియగును. మనస్సున సౌఖ్యము, దూర దేశంలో ఉన్నవారి వల్ల ధన లాభములు, స్త్రీ వలన సౌఖ్యము ప్రయత్నించిన కార్యములు నెరవేరుట వలన ఆనందము, పుణ్య నదీ స్నానములు, తీర్ధయాత్రలు చేయుట గొప్పవారితో పరిచయాలు, సభా గౌరవములు సన్మానాధులు.

**సెప్టెంబర్ :** ఈ మాసము శుభాశుభ మిశ్రమముగా శ్రమకు తగిన ఫలితము ఉండుట, వివాహాది శుభకార్యములు, అనుకూలించుట, స్వప్నమునందు చెడు కలలు వచ్చుట, బంధుమిత్రాదులలో ఇష్టాగోష్టి తలకు సంబందించిన అనారోగ్యములు, శరీరంనందు బాధ.

**అక్టోబర్ :** తలకు నంబంధించిన అనారోగ్యములు, వేళ దాటిన భోజనములు బంధుమిత్రాదులతో విరోధములు, స్ధాన చలనములు, దుర్మార్గుల నహకారం విద్యార్ధులకు కలసివచ్చును. శతృవులు మిత్రులుగా మారుట. పూర్వ మిత్రుల కలయిక, కొత్త వ్యాపారం ప్రారంభింతురు.

**నవంబర్ :** భూసంబంధిత వ్యవహారములు యందు విజయం సాధించెదరు. దుష్టులతో సహవాసం, మనస్సునందు కలత , భార్య భర్తలయందు సఖ్యత లోపించుట, ఎత్తునుండి పడిపోవుట, మానసిక, వ్యాకులత చెందెదురు. విరోధములు చర్మ సంబందిత అనారోగ్యములు.

**డిశెంబర్ :** ధనము అనుకున్న సమయానికి చేతికి అందుట, ఇంటి యందు వస్తు వాహన లాభములు, ధనము నిల్వ చేసుకొనుటకై ఆలోచనలు సఫలమగుట, చేయువృత్తి వ్యాపారములందు లాభములు. ప్రయత్నించిన కార్యములు విజయవంతం అగుట ఇంటియందు శుభకార్యములు, పాతబాకీలు వసూలగుట, శతృవులపై ఆధిక్యత.

**2018 జనవరి :** మనస్సున ధైర్యము, ధర్మ కార్యముల కొరకై ధనము ఖర్చు చేయుట చేయు వృత్తి వ్యాపారములు అనుకూలించును. బంధుమిత్రాదులలో మాట మాట పట్టింపులు, స్ధాన చలనములు, చుట్టములతో ద్వేషము శరీరమునకు అనారోగ్యము, అనవసరపు ప్రయాణము వలన ధన వ్యయము.

**ఫిబ్రవరి :** ఇంటియందు శుభకార్యములు, విందు వినోదాలయందు పాల్గొందురు. శరీరం నందు స్వల్ప అనారోగ్యం పెద్దవారియందు గౌరము కలిగి ఉండుట, కొత్త పరిచయం కలిసి వచ్చుట, శతృలాభము శ్రమకు తగిన ఫలితము, పెండింగ్‌లో ఉన్న పూర్తియగుట.

**మార్చి :** రాజకీయ నాయకుల మన్నన, సృబుద్దిచే ప్రారంభించిన కార్యములు నెరవేరుట, ధన ధాన్యాభివృద్ధి, సంతోషము, మనస్సున ధైర్యము, విందులు యందు పాల్గొనుట, ధర్మ కార్యముల కొరకై ధనము ఖర్చుచేయును. సంతాన లాభము గృహనిర్మాణాదులు ప్రారంభించుట.



# మీనరాశి

పూర్వాభాద్ర 4 పా॥
ఉత్తరాభాద్ర 1, 2, 3, 4 పా॥
రేవతి 1, 2, 3, 4 పా॥

**ఆదాయం : 11, వ్యయం : 5, రాజపూజ్యం : 2, అవమానం : 4**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 3**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

పూర్వాభాద్ర నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం
ఉత్తరాభాద్ర నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 8, అదృష్ట రత్నం నీలము
రేవతి నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 5, అదృష్ట రత్నం పచ్చ.

పూర్వాభాద్ర నక్షత్ర స్త్రీ పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు, ఉత్తరాభాద్ర నక్షత్ర స్త్రీలు నీలము ఎడమ చేయి మధ్య వ్రేలునకు, పురుషులు కుడిచేయి మధ్య వ్రేలునకు, రేవతి నక్షత్ర స్త్రీ, పురుషులు పచ్చ కుడిచేయి చిటికిన వ్రేలునకు ధరాంచలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట శుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు సెప్టెంబరు 12 వరకు సప్తమి స్థానమైన కన్యారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు అష్టమ స్థానమైన తులారాశి యందు సంచరించును. శని జూన్ 20 వరకు దశమ స్థానమైన ధనూరాశియందు తదుపరి అక్టోబర్ 26 వరకు వక్రగతి పొంది భాగ్య స్థానమైన వృశ్చిక రాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు దశమ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు-కేతువులు ఆగస్టు 17 వరకూ రాహువు షష్ఠమ స్థానమైన సింహరాశి యందు కేతువు ద్వాదశి స్థానమైన కుంభరాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు పంచమ స్థానమైన కర్కాటక రాశియందు కేతువు ఏకాదశ స్థానమైన మకరరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు సెప్టెంబరు 12 వరకు సప్తమరాశి కన్యారాశి సంచారము వలన పెద్దవారి మన్ననలు పొందుతారు. ఇష్టములు సిద్ధించును. ప్రతీ పనియందు ఆర్భాటములు, డాంభికము ప్రదర్శించక నియమబద్ధంగా దీక్షగా చేసినా ఏ పని అయినా సఫలీకృతముగా ఉ ండి అందరి మన్ననలు పొందుతారు. బంధుఘోష, జనఘోష ఎక్కువగా ఉంటుంది. ప్రతీ పనియందు గుట్టుచెప్పకుండుట మంచిది. మౌనం ఎంత వహిస్తే అంతయూ మీకు అదే శ్రీరామరక్ష. అకారణముగా కార్యము సిద్ధించును. ధనలాభము ప్రతీ పనియందు భీతివదిలి ముందుకు సాగిన ఫలము సిద్ధించును. కళత్రము వలన బాధలు. మీ మాటకు విలువ ఉన్ననూ సంఘకార్యములకు దూరముగా ఉండుట.

ముందు రాబోవు రోజులకు మంచిది. విదేశీ ప్రయాణాలు అంత అనుకూలము కాదు. తరువాత సంవత్సరాంతం వరకూ గురుడు అష్టమరాశి తులారాశియందు సంచారము వలన గాంభీర్యము తగ్గుట. పెద్దవారితో యిబ్బందులు కావున ప్రతీపని పెద్దవారి ఆలోచన మేరకు చేయుట శ్రేయోదాయకం. అనవసరపు విషయములు యందు యిష్టత ముఖ్యముగాదు. భార్యాబిడ్డలతోను, బయటవారితోను ఎంత మౌనం వహిస్తే అంత మంచిది. భార్య తరఫువారితో కలహములు, యిబ్బందులు శని జూన్ 20 వరకు దశమరాశి ధనూరాశి సంచారము, సామాన్యం ప్రతీ విషయము ఎక్కువగా ఆలోచించుట. వృత్తి, వ్యాపార ఉద్యోగములు యందు ఆటంకములు లేక భయాందోళన. అక్టోబరు 26 వరకూ నవమస్థాన వృశ్చిక రాశి సంచారము తరువాత సంవత్సరాంతం వరకు శని అంతంతమాత్రమే రాహువు ఆగష్టు 17 వరకూ యోగించును. ధైర్యముతో కూడిచేసిన పనులు విజయము కలుగును. ప్రతీ విషయమున లాభము చేకూరును. పరాక్రమము అధికము. బుద్ధికుశలత కేతువు ఆగష్టు 17 వరకూ ద్వాదశస్థానమందు కుంభరాశియందు సంచారము శత్రభయం లేక అందరూ శత్రువుగా భావించుట, ధనము వ్యయమధికము. రాబడి తక్కువ. నేత్రబాధ అన్యస్థల నివాసం మొత్తముగా ఈ రాశివారికి ఈ సం॥రం అంతంతమాత్రముగా శుభాశుభ మిశ్రమము. స్త్రీలకు కుటుంబంలో అసంతృప్తి, అనారోగ్యం వలన ఆందోళన, బంధు మిత్రులతో కలహ సూచనలు ఆలోచించి మంచిని గ్రహించి మసులుకోవడం వలన మనోవ్యధను, విరక్తిని భయాందోళనను అధికమించగలరు. రాజకీయాల్లో ఉన్నవారికి మాటా మాటా పట్టింపులు అధికారులతో ఉన్నవారికి పదవీయోగము. వాత సంబంధ అనారోగ్యములు, స్త్రీ మూలక ఇబ్బందులు జంతు భయము ఒంటరితనం అనుభవించుట, కంఠము, నడుములకు నొప్పులు.

**దోష పరిహారం-శాంతి :** ఈ రాశివారు కేతువు, శనులకు ఆగష్టు 17లోపుగా కేతువుకి 7 వేలు జపం. శనికి 19 వేలు, మృత్యుంజయునికి 11వేలు జపం జరిపించి కేతువుని $1^1/_4$ కేజీ ఉలవలు శనికి-తిలదానం యివ్వాలి. సెప్టెంబరు 12 తరువాత గురువారం నియమం పాటించి 11 గురువారములు శివాలయమున రుద్రాభిషేకం జరిపించి గృహమున **మహాలింగార్చన** చేయుట దోషనివారణ జరిగి శుభఫలితములు కలుగును. ప్రతీ రోజూ పంచాక్షరీ జపం. శని, గురువారములు ఈ సం॥రం అంతయు శివాలయ దర్శనం చేయుట అత్యంత శ్రేయోదాయకం **"నరఘోషరక్ష"** ధరించాలి. ఆంజనేయస్వామివారిని ప్రతీ శనివారం పూజించాలి.

**ఏప్రియల్ :** ఇష్టము సిద్ధించుట, ఆరోగ్యము, వివాహ విషయములందు విజయము చేకూరుట, సంతాన సౌఖ్యము, భార్య యొక్క ఆలోచనలు కలసివచ్చుట, దుబారా అధికము, వ్యసనాలరీత్యా ధనవ్యయము, మిత్రులవల్ల మాట పడే అవకాశం ఉంటుంది.

**మే :** శుభా శుభ మిశ్రమము, వేళదాటిన భోజనము, ఆదాయం కలసివచ్చును, గృహనిర్మాణాది పనులు కష్టంమీద నెరవేరును, సోదర కలహములు, మానసిక ఆందోళన, అవినీతి ఆరోపణల నుండి బయటపడుట, వాహన యోగ్యము.

**జూన్ :** స్థిరాస్థి కలసివచ్చును, పాత పనులు నెరవేరుట, ప్రేమ వ్యవహారములు దెబ్బతినుట, కుటుంబ కలహాలు, పట్టుదల అధికంగా ఉండును, దేవా లయ దర్శనములు, కాంట్రాక్ట్ దారులకు ధనము చేతికి అందుట, గ్రామ కార్యములందు పాల్గొనుట, నూతన గృహ ప్రయత్నములు అనుకూలించుట.

**జూలై :** ఆదాయం మించిన ఖర్చులు, ధనము ఏదో విధంగా చేతికి అందుట, వ్యాపార వ్యవహారములు అనుకూలించుట, సన్మానాలు మరియు దైవకార్యముల కొరకై ధనము ఖర్చుచేయుట, మీ క్రింది పనిచేయు వారి వల్ల ఇబ్బందులు, మాసము చివరి యందు అపవాదములు.

**ఆగష్టు :** ఋణములు చేయుట, గతమాసము కంటే అనుకూలముగా ఉండును. ఆదాయ వనరులు స్వల్పంగా పెరుగును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరము కొత్తవారితో పరిచయాలు, ఋణములు చేయుట, కాంట్రాక్ట్దారులకు ధనము చేతికి అందును.

**సెప్టెంబర్ :** భార్య పిల్లలతో విరోధాలు, సంతాన ఒత్తిడి, జ్వరములు, మాతృ సంబంధిత అనారోగ్యములు, ప్రయత్నించిన కార్యములు ఆలస్యంగా నెరవేరుట, శుభ కార్యములు యందు పాల్గొనుట, ఆదాయంమించి ఖర్చులు, స్థిరాస్థి అమ్మకాలు.

**అక్టోబర్ :** సినీ పరిశ్రమ వారికి కలసివచ్చును. ప్రయాణములు అధిక మగును, శుభకార్యములు కలసి వచ్చుట, క్రితము ఆగిఉన్న పనులు నెరవేరుట, జాయింట్ వ్యాపారస్తులకు జాగ్రత్త అవసరము, మీ మనస్సు మీ ఆధీనంలో లేకుండుట నూతన వ్యాపారములు కలసివచ్చుట.

**నవంబర్ :** అధికారులతో జాగ్రత్త అవసరము, స్త్రీ పరిచయాలు, సోదర సహకారం, మీ క్రింది పనిచేయువారిలో ఇబ్బందులు, కోపం ఆధిక్యత పెరుగును. ఆదాయం సరిపోకుండుట, నరఘోష అధికము, పాలపనులు నెరవేయుట.

**డిశెంబర్ :** ప్రయత్నించిన కార్యములు అనుకూలించుట, మీ క్రింది పనిచేయువారివల్ల సమస్యలు, ఆదాయం పెరుగును. కోర్టు వ్యవహారములు అనుకూలించుట, కోర్టు సంఘ వ్యవహారము, జయం పొందుట, వాహన యోగం, దైవసంబందిత కార్యములు యోగములకొరకై ధనము ఖర్చు.

**2018 జనవరి :** రాజకీయంగా గౌరము పొందుట, విరోధి నాశనము, వ్యాపారం నందు భిన్నాభిప్రాయాలు, ధనాదాయం సామాన్యము, విరోధాలు, సొంత ఆలోచనలు కలసివచ్చుట, జీర్ణక్రియ సంబంధిత అనారోగ్యము.

**ఫిబ్రవరి :** విద్యార్థులకు ఆనందం తక్కువ, శ్రమ అధికము, విరోధాలు, ఆందోళన కోర్టు సంఘ వ్యవహారములు కలసిరాకపోవుట, దుష్టులతో పరిచయాలు జీవనం సాఫీగా ఉండక పోవుట కలహములు, వ్యాపారము సౌఖ్యము, సంతాన రీత్యా సమస్యలు.

**మార్చి :** జీవనం సాఫీగా ఉండును, స్థిరాస్థి వృద్ధి, డాంభికము అధికంగా ఉండును, తీర్థయాత్రలు, ధర్మ కార్యముకొరకై ధనవ్యయము, సాహస కార్యములు చేయుట, అధికారులు మన్ననలు పొందుదురు, పితృ సంబంధిత ఆస్తి కలసివచ్చును.

## ఏలినాటి శని ప్రభావము

మనం జన్మించినపుడు ఉండే గ్రహ సంచారము జన్మలగ్న ఫలితము లగును. ప్రస్తుత గ్రహ సంచారములు గోచార ఫలితములగును. ఏలినాటి శని అనేది గోచారములో దోషమే మన జన్మరాశికి 1-2-12వ రాశులు సంచరించు కాలమంతయు ఏలినాటి శని 7 1/2 సం॥లు. మన జన్మ రాశికి 4వ రాశియందు సంచరించు కాలమంతయు అర్ధాష్టమ శని 2 1/2 సం॥లు, మన జన్మరాశికి 8వ రాశియందు సంచరించు కాల మంతయు అష్టమ శని అనియు 2 1/2 సం॥లు, ఈ విధముగా శని మానవులకు కష్ట నష్టములను కలిగించును. కొందరికి అధికముగాను, కొందరికి అల్పముగాను ఫలితములు కలుగజేయుటకు శని వారివారి జాతకము బలాబలములు అనుసరించే దోషసాంద్రతలు కలిగి ఉంటున్నాయి. ఏలినాటి శని ప్రతీ 30 సం॥లకు ఒకసారి ప్రవేశించును. ద్వాదశి రాశిలో శని భగవానుడు ప్రవేశించుటతోనే **ఏలినాటి శని** ప్రారంభమై మొదటి 2 1/2 సం॥లు మనకు అనుకోని విధంగా ఖర్చులు ప్రారంభమగును. మనస్సున చికాకులు, కుటుంబ కలహములు చేయు వృత్తి వ్యాపారాదులుయందు ఆటంకములు కలుగ జేయును. జన్మరాశిలో ఇంకొక 2 1/2 సం॥లు ఉంటూ మన దేహమునకు అనారోగ్యమును, నరముల సంబంధిత వ్యాధులు, తేజో హాని, బుద్ధి మందగించుట, అధిక భయము, బంధు విరోధములు కల్గించును, తదుపరి ద్వితీయ రాశిలో ఇంకొక 2 1/2 సం॥లు ఉంటూ అధిక నష్టము, కలహములు, నేత్ర సంబంధిత రోగము ప్రతీ విషయమున ఘర్షణలు, తగాదాలు కలిగించును. ఈ విధముగా ఏలినాటి శని 7 1/2 సం॥లు బాధించును.

**అర్ధాష్టమ శని :** మన రాశికి 4వ స్థానములో శని ప్రవేశించడంతోనే 2 1/2 సం॥ల కాలము స్థాన చలనము, వాహన ప్రమాదములు, స్థిరాస్తివలన మార్పులు. వాత సంబంధిత అనారోగ్యములతో భాదించును.

**అష్టమ శని :** మనరాశికి 8వస్థానములో శనిప్రవేశించడంతోనే 2 1/2 సం॥లు కాలం అధికమైన మానసిక వేదన, ఇంటా బయటా అనేక సమస్యలు, అనవసర కేసులో చిక్కుకొనుట, అవమానములు, నరముల సంబంధిత వ్యాధులతో బాధించును.

**దోష పరిహారం :** శనివారం శివాలములో అభిషేకములు చేయించి నువ్వులు, బియ్యము, నలుపు వస్త్రము, మహిషి ప్రతిమ దానములు చేయుట, మందపల్లిలో తైలాభిషేకములు చేయించుకొనుట అనేక, అనేక శనీశ్వర గ్రహ దోషపరిహారములు ఆచరించుటవలన కొంతవరకూ దోష సాంద్రతను తగ్గించుకొనగలము అనుటలో ఏ మాత్రము సందేహం లేదు.

